# కొత్తపల్లి

## తెలుగు పిల్లల ఈ (e) మాస పత్రిక


సంచిక:9 డిసెంబరు 2010 సంపుటి: 3

( http://kottapalli.in లోని e - సంచికకు పుస్తక రూపం )


### ఈ సంచికలో. . . .



నీళ్ళను వెతికిన చేప





ఎల్లలెరుగని వాళ్ళము

ఈ మాసపు ముఖచిత్రం

"చలికాలం మొదలైంది"

చిత్రకారుడు: వీరాంజనేయులు






# క్రిస్మస్

చలికాలం.

ఎముకలు కొరికే చలి.

రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నై.

రాము వాళ్ల ఇంట్లో కూడా చలిగానే ఉంది: పైన తాటాకుల కప్పు- ఆ కప్పులోంచి పగటి పూట ఎండ, సాయంత్రం తర్వాత చలి లోపలికి దూరుతుంటాయి..

రాము వాళ్ల అమ్మ వాడికొక ముతక దుప్పటి ఇచ్చింది. తనొక పలచని చీర కప్పుకొని, గదిలో ఒక మూలగా చాపమీద ముడుచుకొని పడుకున్నది. రాముకోసం మరొక చాప ఉంది వాళ్లింట్లో.

రాత్రి అవుతున్న కొద్దీ చలి కూడా పెరిగింది. ఇప్పుడది ఎముకల్ని నమిలేస్తున్నది.

రాముకి మధ్యలో మెలకువ వచ్చింది. కడుపు బిగబట్టుకొని అటూ ఇటూ దొర్లాడు కొంత సేపు, నిద్రపట్టలేదు- కళ్లు తెరచి వాళ్ల అమ్మవైపు చూశాడు, నిద్రలోనే వణుకుతోంది.

రాములేచి, తనుకప్పుకున్న దుప్పటిని వాళ్ల అమ్మకు కప్పాడు.

రోజూతను ఒళ్ళుతుడుచుకునే తువ్వాలని తీసి, తలనిండా కప్పుకొని, తలుపు తీసుకొని- బయటికి అడుగు పెట్టాడు.

ఎదురుగుండా ఉన్న ఇంటికి ఒక నక్షత్రం వ్రేలాడుతున్నది- ఎర్రటి కాగితం- లోపల కరెంట్ బల్బు.

నక్షత్రం ప్రకాశవంతంగా వెలుగుతున్నది: "బల్బు వేడిగా ఉంటుంది!" అన్నది మనసు. రాము మొఖం చిరునవ్వుతో వెలిగిపోయింది. రోడ్డు దాటి, నక్షత్రం దగ్గరికి వెళ్లి నిలబడ్డాడు.

అంతలో- గడగడ శబ్దం చేసుకుంటూ, సూటిగా రాము ముందుకే వచ్చి ఆగిందొక బండి-

అది ఎటునుండి వచ్చిందో మరి, తెలీనేలేదు!

చాలా వింతగా ఉంది! దాన్ని జింకలు లాగుతున్నై, వాటి వంటినిండా దుబ్బలు దుబ్బలుగా పెరిగిన ఉన్ని!

ఆ బండిలో ఒక వింత ముసలాయన కూర్చొని ఉన్నాడు: ఎర్రటి బట్టలు, ఎర్రటిటోపీ, పొడుగాటి ఆ టోపీ చివరన ఒక ఎర్ర బంతి, పొడవాడి తెల్ల గడ్డం, తెల్లటి- పెద్దపెద్ద- మీసాలు.

" హేయ్ ! హేయ్ ! బాగున్నావా, మెర్రీ క్రిస్మస్ !" అన్నాడా తాత. బండిలోంచి ఒకపెద్ద ప్యాకెట్టును తీసి రాముకి ఇస్తూ.

" మీరు క్రిస్మస్ తాత కదూ ?! బహుమతిని ఇవ్వాల్సింది, నాకు కాదు. ఈ ఇంట్లో ఉండే పీటర్‌కు! " అన్నాడు రాము- "ఈ నక్షత్రమూ, ఆ క్రిస్మస్ చెట్టూ అన్నీ పీటర్ వాళ్లవే".

" ఓహో ఓహో " అని నవ్వాడు తాత. "అయినా పర్లేదు- ఈ బహుమతి నీకే" అన్నాడు- బహుమతిని రాము చేతిలో పెట్టేసి.

"మరి పీటర్ కి?"

తాత కళ్ళు లైటు వెలుగులో వింతగా మెరిశాయి. వెనక్కి తిరిగి వెళ్ళి బండి ఎక్కాడు.

"అయ్యో! అయ్యో ! మళ్ళీ పీటర్ లేచి తన బహుమతి కోసం వెతుక్కుంటాడు, నాకేమీ అక్కర్లేదు తాతా... " అంటూనే ఉన్నాడు రాము - తాత , బండి మరి ఎప్పుడు వెళ్లిపోయారో, ఏమో- తేరుకొని చూసేసరికి, వాళ్ళు వచ్చిన జాడలు కూడా లేవు!

రాము విచారంగా తన చేతిలోని బహుమతికేసి చూసుకున్నాడు. ప్యాకెట్టు మెరిసిపోతున్నది.

దానికి కట్టిన పచ్చరిబ్బను చాలా ముద్దొస్తోంది. దాన్ని పట్టుకొని ఒక అడుగు తన ఇంటి వైపు వేశాడు- " ఊహూ వద్దు, ఇది నీకు కాదు- పీటర్‌కే. పాపం! వాడు ఈ బహుమతి కోసమే కదా, నక్షత్రం తెచ్చిపెట్టాడు; క్రిస్మస్ చెట్టు పెట్టాడు; అన్నీ చేశాడు ?! నీకు బాగా డబ్బులొచ్చాక, వచ్చే సంవత్సరం క్రిస్మస్‌కు మీ ఇంటి ముందూ ఒక నక్షత్రం పెట్టుకుందువు. అప్పుడు తాత ఇచ్చే బహుమతిని నువ్వు తీసుకో. ఇది నీకొద్దు" అన్నది మనసు.

రాము వెనక్కి తిరిగి వెళ్ళి దాన్ని క్రిస్మస్ చెట్టు కింద పెట్టేసాడు. వెనక్కి తిరిగి చూడకుండా గబగబా వాళ్ళ ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఇంటి తలుపు తెరవగానే వాడికి ఆశ్చర్యంతో నోట మాటరాలేదు- తన మంచం మీద- ఇంకా పెద్ద ప్యాకెట్టు ఒకటి ఎదురుచూస్తోంది, తనకోసం!

ప్యాకెట్టు మీద పచ్చరంగులో ఏదో రాసి ఉంది మెరుస్తూ- "నీ సౌహార్ద్రతకు మెచ్చి ఈసారికి నేనిచ్చే బహుమతి ఇది. వచ్చేసారి ఇంకా మంచి బహుమతి తెస్తాను!" అని.

ప్యాకెట్టు లోపల వెచ్చని రగ్గులు రెండు- చక్కగా మడతపెట్టి ఉన్నాయి!

మంచి మనసున్న మీ అందరికీ క్రిస్మస్ శుభాకాంక్షల రగ్గులు.

కొత్తపల్లి బృందం.

కొత్తపల్లి పత్రిక ఈ సంచికనీ, పాత సంచికల్ని కూడా మీరు ఉచితంగా ఇంటర్నెట్లో చూడవచ్చు. పత్రికను e-పుస్తకం రూపంలో చదవచ్చు; పిడియఫ్ రూపాన్ని డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. సందర్శించండి:

http://kottapalli.in/2010/12/welcome



# నీతి చంద్రిక

14 వ భాగం

*మూల రచన: కీ.శే.పరవస్తు చిన్నయ సూరి* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

*జరిగిన కథ: పింగళకుడు, సంజీవకుడు ఇద్దరూ మంచి మిత్రులౌతారు. కరటకుడికి అది ఇష్టం ఉండదు. అది దమనకుడితో తన గోడు వెళ్ళబోసుకుంటుంది. ఇక చదవండి, ..నీతి చంద్రిక పధ్నాలుగవ భాగం:*

అప్పుడు దమనకుడు "చెడిపోనున్న పనిని బాగుచేసుకునేందుకు, రానున్న లాభాన్ని పొందేందుకు, జరిగిన నష్టాన్ని భర్తీ చేసుకునేందుకు కూడాను, అవసరపడేది ఉపాయమే తప్ప, వేరుకాదు. కాబట్టి ఇప్పుడు మనం వెతుకవలసినది ఆ ఉపాయాన్నే. పింగళకానికి, సంజీవకానికి మధ్య తగవు పుట్టించేందుకు తగిన ఉపాయం ఆలోచించాలి ఇప్పుడు. అలా వాటి మధ్య భేదం(తగవులాట) పుట్టిస్తే మన కోరికలన్నీ నెరవేరతాయి. మనం ఇప్పుడు ఆ సంగతిని పట్టించుకోకుండా వదిలివేస్తే, ఆనక మనకు పింగళకుడిని ఆశ్రయించి ఉండటమే కష్టం అయిపోతుంది" అన్నది.

"అదెట్లా సాధ్యం?" అని అడిగింది కరటకం.

"వంద విధాలుగా పరాక్రమించి సాధించలేని దానిని కూడా ఒక్క ఉపాయంతోటి సాధించవచ్చు. ఒకప్పుడు మామూలు కాకి ఒకటి, తనకు హాని చేస్తున్న భయంకర సర్పాన్ని ఉపాయం చేతనే కదా, నాశనం చేసింది? నీకు ఆ కథ చెబుతాను విను" అని దమనకం కాకి-పాము కథ చెప్పసాగింది:

**కాకి-పాము**

యమునా నది ఒడ్డున ఉన్న అడవిలో, మర్రి మ్రాను మీద- గూడు కట్టుకొని నివసిస్తూ ఉండేది- ఒక కాకి జంట. ఆ చెట్టు క్రింద పుట్టలో ఒక పాము నివాసం ఉండేది. కాకి పెట్టిన గుడ్లనన్నిటినీ అది ఎప్పటికప్పుడు చక్కగా తినేసి పోతుండేది. కాకికి చాలా బాధ వేసింది. చివరికి అది తన స్నేహితుడయిన నక్క దగ్గరికి పోయి, త్రాచుపాము వల్ల తనకు మాటిమాటికి కలుగుతున్న నష్టాన్ని చెప్పుకొని బాధపడ్డది.

అప్పుడు నక్క దాన్ని ఓదార్చుతూ "చెరువులో ఉన్న చేపలనన్నిటినీ మోసం చేసి తినేసిన కొంగను, ఒక మామూలు ఎండ్రి ఉపాయంతోటే గదా, తుదముట్టించింది? నీకు ఆ కథ చెబుతాను విను" అని, దానికి కొంగ-ఎండ్రి కథ చెప్పసాగింది:



**కొంగ-ఎండ్రి**

బదరికా వనంలో 'సారోదం' అనే చెరువు ఒకటి ఉండేది. ఒకసారి అక్కడికి ఒక ముసలి కొంగ వచ్చింది. కొన్ని రోజులపాటు అది కళ్ళు సగం మూసుకొని, ఆహారం తినకుండా, తీవ్రమైన తపస్సు చేసేదాని మాదిరి, నీళ్ళలో ఒంటి కాలిపైన నిలబడి ఉన్నది.

ఒక ఎండ్రి దాని పద్ధతిని గమనించి, చాలా ఆశ్చర్యపడి, దాని దగ్గరికి పోయి, "ఓ కొంగరాజా! నువ్వు చాలా కృశించిపోతున్నావు.

నీ ప్రక్కగా పారాడే చేపల్ని కూడా కనీసం కన్నెత్తి చూడటంలేదు నువ్వు. నీ ఈ ప్రవర్తనను చూస్తే, ఏదో మహాద్భుతమైన కోరికను సాధించటంకోసం నువ్వు చేపట్టిన నిరాహార దీక్షేమో ఇది- అని నాకు అనుమానం కలుగుతున్నది. విచిత్రమైన నీ కథను వివరించి, నా చెవులకు సంతోషాన్ని కలిగించు" అన్నది.

అప్పుడు ఆ కొంగ చల్లగా "ఓ కర్కటోత్తమా! నువ్వు చాలా తెలివి గలవాడివి. ఆకారాన్ని చూసి మనసులోగల భావనలను చదవగల సమర్థుడివి. కోరికలను వదిలిపెట్టి, మౌనాన్ని ఆశ్రయించిన మాలాంటి వాళ్ళకు కూడా, నీ మాటల తీరును చూసి, మాట్లాడాలని ఉత్సాహం కలుగుతున్నది.

నేను పుట్టినప్పటినుండీ నా కడుపున పడి మరణించిన జంతువులు ఇన్ని అన్ని అని చెప్పలేను. అట్లా మా జాతి సహజంగా ప్రాణిహింస చేసి, తద్వారా నా శరీరాన్ని పోషించుకుంటూ చాలా కాలం గడిపాను. ఒకసారి నేను గంగానదికి ఉత్తరపు గట్టున, ఒక మర్రిచెట్టు మీద కూర్చొని ఉండగా, ఆ చెట్టు క్రింద ఒక యోగి శ్రేష్ఠుడు, తన శిష్యులకు అనేక ధర్మాలను ఉపదేశిస్తూ 'మోక్షాన్ని కోరేవాళ్ళు తప్పక ఆచరించాల్సిన ధర్మాలను చెబుతాను, వినండి:



అన్ని పాపాలకు మూలం అయినది దురాశయే- కనుక మొదట దాన్ని వదిలిపెట్టాలి. అన్ని ప్రాణుల పట్లా దయ కలిగి ఉండాలి. లోభం లేకపోవటం, భూతదయ లేకపోవటం అనే గుణాలు ఎవరికైతే ఉంటాయో, వాళ్ళు మిగతా ఎన్ని ధర్మాలను పాటించినా ఫలితం ఉండదు. మన జీవితం క్షణంలో నశిస్తుంది- ఇది శాశ్వతంగా ఉండేది కాదు. అందువల్ల, మనిషన్నవాడు కాలాన్ని వృధా చేసుకోకుండా, ఊరికే పొద్దు పుచ్చకుండా, ఉత్తమ ధర్మాలను

పాటించాలి ' అని చెప్తుండటం విన్నాను. ఏ పుణ్యం చేసుకున్నానో గాని, ఆనాటినుండీ ఆ మహానుభావుడు చెప్పిన ధర్మాలు నా మనసులో నాటుకొని, ఇక నిద్రలోకూడా మరపుకు రాలేదు. అదిగో- ఆనాటినుండే నేను పురుషార్థాలమీద మనసు నిలిపాను. హింసతో కూడిన పనులంటే రోత పుట్టింది నాకు. నీళ్ళు, నాచు మొదలైనవి తింటూ నా యీ శరీరాన్ని నిలుపుకుంటున్నాను. మోక్షాన్నే కోరి, ముని మాదిరి జీవితం గడుపుతున్నాను" అన్నది.

అక్కడ నివసించే చేపలు ఈ మాటలు విని, చాలా సంతోషించినై: "ఆహా! ఈ మహానుభావుడు నివురు గప్పిన నిప్పులాంటి వాడే, మామూలు కొంగ కాదు!" అని, అవి దాని దగ్గరికి పోయి, "ఓ మహానుభావా! నీ దయను కాస్త మాపైన కూడా ప్రసరింపజేయి. కల్మషంలేని బుద్ధితోనిన్ను సేవించుకునేందుకు వచ్చాం" అన్నాయి.

అప్పుడా కొంగ వాటిని ఆదరపూర్వకమైన చిరునవ్వు ఒలకగా చూసి, క్రీగంటనే వాటి ప్రార్థనను స్వీకరించి, ఆనాటినుండి వాటితో స్నేహం చేసింది.




అలా కొంతకాలం గడిచాక ఒక నాడు ఉదయాన్నే "బాగా నిద్ర పట్టిందా?" అని అడిగేందుకు వచ్చిన చేపలకు ఆ కొంగ- దీనవదనంతో, కన్నీళ్ళు నిండిన కనులతో, నిట్టూర్పులు విసురుతూ కనబడ్డది. అట్లా అది ఆ చేపలను కన్నీళ్ళతోటే సమాదరించి, తల ఊపి, కొంచెం ఆగి ఆగి మాట్లాడుతూ- "కాలం బలమైనది. కాలమహిమను ఎవ్వరు కాదనగలరు?" అన్నది.

అప్పుడా చేపలు "తపోధనా! చాలా కాలంనుండీ నిన్ను ఎరిగినవాళ్ళం. నువ్వు 'నిత్యసంతోషివి' అనిపించావు మాకు. అట్లాంటి నీకు- ఈరోజున ఇంతటి దు:ఖం

ఎందుకు కల్గుతున్నది?" అని అడిగాయి.

అప్పుడా టక్కరి కొంగ, జీరబోయిన గొంతుతో " 'నాకు రోజులు దగ్గర పడ్డాయి గదా, అందువల్ల ఇక ఊరికే ఉండకూడదు' అని, 'బంధుమిత్రులు, పిల్లా పాపలు' అనే బంధాలన్నిటినీ విడిపించుకొని ఉన్నాను. 'సుఖంగా ఉన్నాను కదా', అనుకునేంతలో నా ప్రారబ్ధం కొద్దీ మీరొకరు, నాకు తగులుకున్నారు! ఇప్పుడు 'మీకు ఆపద రానున్నదే' అని నా మనసు తల్లటపడుతున్నది. నేనేం చేసేది?" అంటూ, బొటబొటా కళ్ళనీళ్ళు కారుస్తూ, "ఇంతకు ముందు కొందరు జాలరులు వచ్చారిక్కడికి. ఈ కొలనులో కొన్ని నీళ్ళే ఉండటాన్ని గమనించి, వాళ్ళు 'ఈ నీళ్ళు ఇంకొంచెం ఇంకాక వద్దాం!' అనుకుంటూ పోయారు. ఆ మాటలు విని నా గుండెలు బ్రద్దలైనాయి. అప్పటినుండీనేను విషాదంలోమునిగిపోయి ఉన్నాను" అన్నది.

అదివిని ఆ చేపలు భయపడి "మమ్మల్ని ఈ కష్టం నుండి ఒడ్డెక్కించే సామర్థ్యం నీకొక్కడికే ఉన్నది. దు:ఖం ఎక్కువవ్వటం చేత విషాదంలో మునిగి ఉన్నావు తప్ప, నీకు తోచని ఉపాయం అంటూ ఉండదు. కొంచెం తేరుకొని ఆలోచించు" అన్నాయి.



అప్పుడా కొంగ కొంచెంసేపు ఊరుకొని, "ఇక్కడికి కొంత దూరంలో 'నిత్యాపం' అనే పేరుగల సరస్సు ఒకటి ఉన్నది. ఒక్కరోజులోనే మిమ్మల్నందరినీ అక్కడికి చేర్చగల శక్తి నాకు లేదు గానీ, నా ఓపిక కొద్దీ రోజూ కొన్నిటిని తీసుకెళ్ళి వదులుతాను" అని రోజూ తనకు కావలసినన్ని చేపలను ముక్కున కరచుకొని పోయి, ఒక కొండమీద పెట్టుకొని తింటూ, కొద్ది రోజులలో ఆ కొలనులోని చేపలన్నిటినీ ఖాళీ చేసేసింది.

అప్పుడు దాని తొలి స్నేహితుడైన ఎండ్రి దాని

దగ్గరికి వెళ్ళి "ప్రియ మిత్రుడా! ఇక్కడి చేపలన్నింటినీ కష్టం నుండి తప్పించావు. అదే విధంగా నన్ను కూడా కాపాడు" అని ప్రార్థించింది. అప్పుడా దొంగ కొంగ 'సరే' అని, దాన్ని కూడా తన ముక్కుతో కరచుకొని, ఆకాశానికి ఎగిరి, అంతకు ముందు తాను చేపలను తిన్న కొండ శిఖరం వైపుకే సూటిగా పోసాగింది.

అది పోయే విధానాన్ని చూసి, ఎండ్రికి అనుమానం వచ్చింది-"ఇప్పుడు ఈ కొంగ నన్ను తీసుకొని పోతున్నది ఈ కొండశిఖరం మీదికే తప్ప, వేరే ఎక్కడికీ కాదు. ఈ కొండ శిఖరం మీద నీళ్లెక్కడివి? "ఈ కొండ మీదగాని, దీని చుట్టు ప్రక్కల గానీ అసలు నీళ్లే లేవు" అని మిత్రులు చెప్తుండగా విన్నాను. ఈ కపటపు కొంగ మోసంతో చేపలన్నిటినీ ఇక్కడికి పట్టుకొని వచ్చి తిన్నది కాబోలు! అయ్యో! తెలియక ఈ దుష్టుడి మాటలు విని మోసపోయానే! తెలివైనవాడు మోసగాళ్ళతోటి మోసంగానే ప్రవర్తించాలి తప్ప, తిన్నగా ఉండకూడదు. అందువల్ల ఎలాగైనా దీన్ని మోసంచేసి తప్పించుకునే ఉపాయాన్ని ఆలోచిస్తాను" అని బాధపడింది.



ఆపైన అది త్వరగా ఉపాయాన్ని ఆలోచించి, మనసులో నిలుపుకొని, కొంగతో "ఓ బకోత్తమా! నువ్వు నన్ను జారిపోకుండా ఆట్టే దూరం తీసుకెళ్ళలేవు. ఎక్కడైనా జారి పడ్డానంటే, భూమి మీద తిరిగే జంతువులు నన్ను వెంటనే చంపి తినేస్తాయి- నీ కోరిక నెరవేరదు. అందువల్ల నేను ఒక ఉపాయం చెబుతాను, విను. నేను నీ గొంతును కౌగలించి పట్టుకొని వస్తాను. గమ్యస్థానం చేరేంతవరకూ నా పట్టు విడువను. అయినా నీకు చెప్పవలసిన పనిలేదు- నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి" అన్నది.

అప్పుడా కొంగ 'సరే దానిదేముంది?' అని,

ఎండ్రిని తన గొంతుకు కరిపించుకొని, కొండమీదికి ఎగిరిపోయింది. అక్కడ అది క్రిందికి కాళ్ళూనబోయేంతలో ఎండ్రి పదునైన తన గిట్టలతో దాని మెడను కరుక్కున త్రుంచి, నేలమీద పడి, ప్రాణాలు కాపాడుకొని, తనదారిన తను పోయింది-

అందువల్ల నువ్వు కూడా మంచి ఉపాయాన్నొకదాన్ని ఆలోచించి, నీ శత్రువును చంపు" అని నక్క చెప్పింది. నక్క చెప్పిన కథను విని, కాకి దాన్ని మెచ్చుకొని ఇంటికి తిరిగి వచ్చింది. (తరువాయి వచ్చే మాసం..)

**జోకులు**

**బ్రదర్!**

బిచ్చగాడు: అయ్యా! ఒక రూపాయి ఉంటే దానం చెయ్యండి

రామారావు: డబ్బు లేదోయ్!

బిచ్చగాడు: ఏదైనా ఒక చొక్కా ఉంటే ఇవ్వండి బాబు!

రామారావు: అది కూడా లేదోయ్!

బిచ్చగాడు: అయితే రా బ్రదర్, ఇద్దరం కలిసి అడుక్కుదాం.

**కుతూహలం**

టీచర్: సూదితో గుచ్చితే రక్తం బయటకు ఎందుకు వస్తుంది చిన్నీ.

చిన్నీ: ఎవరు గుచ్చారో చూద్దామని టీచర్.




# అల్లరి కోతి



*సేకరణ, కథనం: ఏ. ఎస్. నందన, 4 వ తరగతి*

ఒక అడవిలో చాలా జంతువులు ఉండేవి. అవి ఒక రోజు సమావేశం అయ్యాయి:

అడవిలో ఒక స్కూలు పెట్టుకోవాలని అనుకున్నాయి. అన్నీ కలిసి సింహం రాజుగారిని అనుమతి అడిగాయి. సింహం ఒప్పుకున్నాడు. వెంటనే స్కూలు కూడా మొదలైంది.

స్కూల్లో కోతి బాగా అల్లరి చేసేది; వేరే వాళ్ళ పెన్సిళ్ళను, పెన్నులను దొంగిలించేది. టక్కరి నక్క పోయి, కోతి దొంగతనం గురించి సింహం రాజుకు ఫిర్యాదు చేసింది.

అప్పుడు రాజు కోతితో "ఇంకోసారి అల్లరి చేస్తే పట్టణంలోకి పంపుతాం" అన్నాడు. రాజు అలా అనగానే కోతి చాలా సంబరపడింది. దానికి పట్నం అంటే చాలా ఇష్టం మరి! అందుకని కోతి ఇంకా ఎక్కువ అల్లరి చేయటం మొదలుపెట్టింది.

ఇక తట్టుకోలేని జంతువులన్నీ కలిసి

న్యాయవిచారణ చేసి, కోతిని అడవిలోంచి తరిమేశాయి.



పట్నం చేరుకున్న కోతికి మొదట్లో చాలా సంతోషం కలిగింది. అక్కడి దుకాణాలు, వాహనాలు చూస్తూ అది తనను తాను మరచి పోయింది. అంతలోనే దాన్ని ఒకపిల్లవాడు పట్టుకున్నాడు. కోతితో సర్కస్ చేపించి బాగా డబ్బులు సంపాదించటం మొదలు పెట్టాడు వాడు. కోతికి కూడా మొదట్లో ఆ ఆట ఇష్టమే అయ్యింది, కాని వాడు రాను రాను దానికి తక్కువ అన్నం పెడుతుండేసరికి, అది చాలా బాధపడింది.

"నేను అడవిలో అల్లరి చేయకుండా ఉంటే బాగుండేది- నాకు ఇన్ని తిప్పలు తప్పేవి కదా" అనుకుంది. ఆ తర్వాత కొద్దిరోజులకు దానికి తప్పించుకునేందుకు అవకాశం వచ్చింది. వెంటనే అది పిల్లవాడి బారి నుండి తప్పించుకొని అడవిలోకి వెళ్ళింది. అక్కడ సింహం రాజు గారి దగ్గరికి పోయి "రాజా! నన్ను క్షమించండి - పట్నం మీది మోజుతో అడవిలోని జంతువులన్నిటినీ వేధించాను. ఇకపై బాగుంటాను- నన్ను ఇక్కడ ఉండనివ్వండి చాలు" అని కోరింది.

సింహం రాజు దాన్ని క్షమించి, అడవిలో ఉండనిచ్చాడు. అప్పటినుండీ అది అల్లరి మానేసింది- బుద్ధిమంతురాలైంది.



# దానధర్మాలు

*రచన: T.నాగమణి, 6 వతరగతి, టింబక్టు బడి.*

*చిత్రాలు: శివ, మహేశ్, జెయన్‌టియు, హైదరాబాదు.*



అవంతీపురం అనేరాజ్యాన్ని విజయుడనే మహారాజు పరిపాలించేవాడు. ఆ రాజు భార్య మందార- వారికి సంతానం లేదు; అందుకని ఎంతో బాధపడుతూ ఉండేవాళ్ళు. కానీ రాజు మాత్రం తన రాజ్యంలోని ప్రజలను చాలా పీడించి, హింసించి పన్నులు వసూలు చేసేవాడు. అంతేకాదు- కరువుకాటకాలు వచ్చినప్పుడు కూడా ప్రజలను పట్టించు-కునేవాడు కాదు. పైపెచ్చు వారిపైన ఇంకా ఎక్కువ పన్నులు వేసి, పన్నులు కట్టాల్సిందేనని ఒత్తిడి చేసేవాడు. తన ఖజానాలోని డబ్బులను ఎంత మాత్రం ఖర్చు చేసేవాడు కాదు. ఏ మాత్రం దాన ధర్మాలు చేసేవాడుకాదు.

రాజు రాణి ఇద్దరూ సంతానం కోసం తిరగని

చోటు లేదు; చూడని గుడి లేదు. చివరికి, అట్లా తిరుగుతూ,తిరుగుతూ వాళ్ళు ఒక మునిని కలుసుకున్నారు.

అప్పుడు ఆ ముని తన దివ్య దృష్టితో చూసి, రాజుతో "చూడండి, మీరు చేసిన పాప ఫలం ఇది. ఇప్పటికైనా గుర్తించండి- ప్రజలంటే ఎవరో కాదు- రాజుకు ప్రజలంతా బిడ్డలే. అలాంటి ప్రజలను పీడించటం వల్ల మీకంటూ వేరే సంతానం కలగలేదు. కాబట్టి, మీ జీవితాలు బాగుపడాలంటే మీరు మీ పిసినారి తనాన్ని విడిచిపెట్టాలి. ఘనంగా దాన ధర్మాలు చేయాలి. పేదలను హింసించకూడదు . అప్పుడు, మీ పుణ్యం కొద్దీ మీకు సంతానం కలుగుతుంది" అని చెప్పాడు.

ఆ మాటలు రాజు-రాణి ఇద్దరిలోనూ అలజడి రేపాయి. వాళ్ళు మునికి ధన్యవాదాలు చెప్పి తమ రాజ్యానికి వెళ్ళారు. అటుపైన రాజుగారు పూర్తిగా మారిపోయినట్లు, గుడులు, సత్రాలు కట్టించాడు; దానధర్మాలు చేశాడు; బలవంతపు పన్నుల వసూళ్లు మానుకున్నాడు; 'ఆ రాజు-ఈ రాజు ఒకరేనా' అన్నట్లు ప్రవర్తించాడు.

అనతి కాలంలోనే ఆ దంపతులకు ఒక పాప పుట్టింది. రాజు, రాణి, రాజ్య ప్రజలు అందరూ ఎంతో సంతోషించారు. ఆ పాప పుట్టిన తరువాత కొన్నేళ్ళపాటు రాజ్యం చాలా సుభిక్షంగా ఉండింది. సకాలానికి వర్షాలు వచ్చాయి; పంటలు బాగా పండాయి; ప్రజలు అందరూ సుఖంగా ఉన్నారు. అయితే పరిస్థితులు ఎప్పుడూ ఒకే విధంగా ఉండవు- రాజ్యంలో మళ్ళీ వర్షాభావ పరిస్థితులు నెలకొన్నాయి ఒక ఏడాది.

ప్రజల మేలు కోసం ఖజానాలోంచి డబ్బులు బయటికి తీయాలనేసరికి రాజుకు మళ్ళీ లోభం పుట్టింది. 'ప్రజావసరాలు తీరాలంటే ప్రజలు పన్ను కట్టకపోతే ఎలా?'అన్నాడు. ప్రజలు గతంలో ఎదుర్కొన్న కష్టాలు మళ్ళీ మొదలయ్యాయి- రాజుగారు ప్రజలను హింసించడం మళ్ళీ నిత్య కృత్యమైంది. ఈలోగా రాజు కూతురు కూడా పెరిగి పెద్దదైంది.

ఒక రోజు పాపకు జబ్బు చేసింది. రాజు వైద్యులకు చూపించాడు, కాని జబ్బుమాత్రం

తగ్గలేదు. రాజ్యంలోని వైద్యులందరిని పిలిపించి పాప జబ్బును నయం చేయమన్నాడు రాజు. కానీ ఏవైద్యుడూ పాపకొచ్చిన జబ్బును నయం చేయలేకపోయాడు.



రాజుకు చాలా భయం వేసింది. ఒక్కగానొక్క పాప దూరం ఐపోతుందేమోనని బాధపడ్డాడు,

చివరికి ఆ సమయంలో రాజుకు ముని గుర్తుకొచ్చాడు. "రాజుకు ప్రజలంతా బిడ్డలే" అని ముని చెప్పటం గుర్తుకొచ్చింది. 'తను ఆ సంగతిని ఎంత త్వరగా మర్చిపోయాడు?!' అని విచారం వేసింది. పశ్చాతాపంతో రాజు మునిని స్మరించి, తనను క్షమించమని వేడుకొన్నాడు.

ఆక్షణంలోనే ఆయన తన మనసును ప్రజా సంక్షేమం వైపుకు మరల్చాడు. ప్రజలనుండి పన్నుల రూపేణా వసూలు చేసిన ధనాన్ని తిరిగి వాళ్ళకోసమే ఖర్చు చేసేటట్లు ఆజ్ఞలు జారీ చేశాడు. పంటకాలువలను, చెరువులను, నీటి పారుదల వ్యవస్థలను, జల సేకరణ వ్యవస్థలను బలోపేతం చేసేసరికి, రాజ్యం మళ్ళీ ఒక గాటన పడింది.

ఆలోగా యువరాణి ఆరోగ్యమూ బాగుపడింది. తను మంచిపనులు చేయటం వల్లనే తన కూతురు బ్రతికిందన్న విశ్వాసంవల్లనేమో, రాజు అటుపైన ఎన్నడూ ప్రజల్ని కష్టపెట్టలేదు. కాలక్రమేణా ఆయనలోని క్రూరత్వం అంతా పోయి, సహజమైన దయాగుణం వేళ్ళూనుకున్నది. 'విజయ మహారాజు మంచివాడు' అన్న ఖ్యాతి నలుదిశలా వ్యాపించింది.



# మోసం

*రచన: ఓం యువశ్రీ,5 వతరగతి, విజ్ఞం స్కూల్, గుడిపాల, చిత్తూరు జిల్లా.*
*చిత్రం: అడవి రాముడు, జెయన్‌టీయు, హైదరాబాదు.*

సింహపురి రాజ్యాన్ని కనక మహారాజు పరిపాలించేవాడు. ఆయన పరిపాలనలో రాజ్యం సుభిక్షంగా ఉండేది. ప్రజలందరూ సరిగ్గా పన్నులు చెల్లించేవాళ్ళు. దాంతో ఆయన కోశాగారం ఎల్లప్పుడూ ధనంతో నిండి ఉండేది.

ఆ కోశాగారానికి సంరక్షకుడు సుబ్బన్న, ముసలివాడవుతున్నాడు. తన తరువాత కోశాగారపు బాధ్యతలు సక్రమంగా నిర్వహించగలిగే యువకుడిని ఎంపిక చేయమని సుబ్బన్న రాజుగారికి మనవి చేసుకొన్నాడు.

రాజుగారు కొంచెం ఆలోచనలో పడ్డారు. సుబ్బన్న సమర్థుడూ, విశ్వాసపాత్రుడున్నూ. తన తండ్రిగారి హయాం నుంచీ కోశాగార

బాధ్యతలు నిర్వహిస్తున్న సుబ్బన్న బలంగా ఉన్నంత కాలమూ తనకు కోశాగారం గురించి ఆలోచించవలసిన పని పడలేదు. ఇప్పుడిక కొత్త వారిని వెతకటం తప్పని సరి.

అందుకని రాజుగారు చాటింపు వేయించారు:"రాజుగారికి ఆంతరంగికుడు ఒకడు కావాలి. చదువూ, బలమూ, తెలివి తేటలూ, నిజాయితీ, దురలవాట్లు లేకుండా ఉండటం- ఇవీ అవసరాలు".

ఇంకేముంది, రాజ్యంలోని యువకులు అందరూ పోటీపడ్డారు. ఆ పోటీలు అన్నింటిలోనూ ఉత్తములుగా ఎంపికైన నలుగురిని రాజుగారి సమక్షంలో నిలబెట్టారు రాజోద్యోగులు.

మహారాజుగారు వారి దేహ దారుఢ్యాన్నీ, చదువునీ, తెలివితేటల్నీ పరిశీలించారు. అన్నింటిలోనూ ఎవరికి వారే సాటి అనిపించారు.

మహారాజు గారు అడిగారు: "మీరంతా పల్లెలనుండి వచ్చినవారే కదా?!

నలుగురూ అవునని తలఊపారు.

"మరయితే మీకు విత్తనాలు నాటటం, మొక్కలు పెంచటం వచ్చా?"

"వచ్చు ప్రభూ!"

"అయితే ఇదుగో అందుకోండి. ఒక్కొక్కరికీ యాభై గ్రాముల శనగ విత్తనాలు. వీటిని మీరు మీ మీ ఇళ్లకు తీసుకెళ్ళి, వేరువేరుగా నాటండి. రెండు నెలలపాటు ఆ మొక్కల్ని జాగ్రత్తగా సంరక్షించండి. గడువు పూర్తవ్వగానే ఆ మొక్కల్ని తీసుకొచ్చి నాకు చూపించాలి. ఒక్క షరతు- మొక్కల్ని సరిగ్గా కాపాడుకోక, వాటికి ఏదో అయ్యిందని, చచ్చి-పోయాయని సాకులు చెబితే బాగుండదు- గుర్తుంచుకోండి" అన్నారు రాజుగారు, వాళ్ళు నలుగురికీ నాలుగు మూటల్లో విత్తనాలు అందజేస్తూ.

నలుగురు యువకులూ వారి వారి ఊర్లకు విత్తనాలు తీసుకెళ్ళి, తమకు తోచిన మంచి భూముల్లో, చక్కగా ఎరువు వేసి, ఈ విత్తనాలను నాటారు. వాళ్ళలో నాలుగోవాడి పేరు పోతన్న- నాటి నెలరోజులు కావస్తున్నా పోతన్న భూమిలో మొలకలు రాలేదు!

ఉండబట్టలేక, అతను మిగిలిన ముగ్గురు

నివసించే ఊళ్లకూ వెళ్ళి చూశాడు- వారికి అలాంటి సమస్య ఎదురవ్వలేదు- వారు నాటిన విత్తనాలు బాగానే మొలకెత్తాయి. మొక్కలుకూడా బాగా పెరుగుతున్నై!

"నేను నాటిన విత్తనాలు ఎందుకు మొలకెత్తలేదు? రాజుగారు అడిగితే ఏం జవాబు చెప్పాలి" అని చాలా ఆందోళన చెందాడు పోతన్న.

చూస్తూండగానే రాజుగారిచ్చిన రెండు నెలల గడువూ పూర్తయింది. రాజుగారు నలుగురినీ పిలువనంపారు. పోతన్నకు ఏంచేయాలో తోచలేదు. "నాకు ఉద్యోగం అవసరం లేదు. రాజుగారి ఆగ్రహం తప్పితే చాలు. నేను అసలు రాజుగారి దగ్గరికే పోను ఈరోజు. రేపు పోయి క్షమాపణ వేడుకుంటాను. ఆలోగా వేరే వాళ్లకు ఎవరికైనా ఉద్యోగం ఇచ్చేసి ఉంటారు కనక, రాజుగారు నన్ను క్షమించకపోరు" అని ఇంటిలోనే దాక్కున్నాడు పోతన్న. కానీ భటులు ఊరుకోలేదు. రావాల్సిందేనని పట్టుపట్టి బలవంతంగా సభకు తీసుకెళ్ళారు.

సభలో మొదటి ముగ్గురూ తమ తమ మొక్కల్ని చూపించారు. అన్నీ ఆరోగ్యంగా, ఏపుగా పెరిగి ఉన్నై. "నీ మొక్కలు ఏవి?" అడిగారు రాజుగారు పోతన్నను. పోతన్న ముఖం వాడిపోయింది. గుండె కంపించింది. భయంతోవణికిపోతూ "ప్రభూ! తమరు ఇచ్చిన విత్తనాలను నేను నిజంగానే శ్రద్ధగా నాటాను! ప్రభువులు నన్ను క్షమించాలి, ఏమయిందోఏమో, అవి అసలు మొలకెత్తనే లేదు" అన్నాడు తలవాల్చుకొని.

మహారాజుగారు అతనివైపు ఒకలాగా చూశారు. ఇక తన ప్రాణాలు పోయినట్లేననిపించింది పోతన్నకు.

అంతలోనే మహా రాజు గారు నవ్వారు. ఈ పోతన్నే మాకు అంతరంగికుడు . మిగిలిన ముగ్గురూ ఇళ్ళకు వెళ్లిపోవచ్చు" అన్నారు.

మిగిలిన ముగ్గురూ తలలు వాల్చుకొని, మారు మాట్లాడకుండా సభలోంచి వెళ్లిపోయారు.

"మీరు ఈ నిర్ణయానికి ఎలా వచ్చారు ప్రభూ? మిగిలిన ముగ్గురూ తెచ్చిన మొక్కలు చక్కగా, ఆరోగ్యంగా ఉన్నాయి; కానీ పోతన్న నాటిన

విత్తనాలు అసలు మొలకెత్తనే లేదు! మరి మీరు అతనినే మీ అంతరంగికునిగా ఎందుకు ఎంచుకున్నారు?" అని రాజుగారిని అడిగారు , సభికులు.

"ఈ నలుగురికీఇచ్చిన విత్తనాలు మామూలువి కావు: మేం వాటిని ఉడికించి, ఎండబెట్టి ఇచ్చాం. అవి అసలు మొలకెత్తే అవకాశం లేదు. అయితే మిగిలిన ముగ్గురూ ఎవరికి వాళ్ళు తమ మొక్కలు మొలవలేదని కంగారు పడ్డారు. ఉద్యోగం కోసం మోసానికి పాల్పడ్డారు. వేరే మొక్కల్ని తీసుకొచ్చి, 'మేం ఇచ్చిన విత్తనాలవే' అని నమ్మింప జూశారు. నిజాయితీగా వాస్తవాన్ని వ్యక్తీకరించిన పోతన్నకే, మాకు అంతరంగికుడయ్యే యోగ్యత ఉన్నది " అన్నారు రాజుగారు, చిరునవ్వు నవ్వుతూ.

**లైట్ వెయిట్ జోకులు**

తండ్రి: ఏరా! ఎగ్జామ్ పేపర్ ఎలా ఉంది.

కొడుకు: చాలా తేలికగా ఉంది నాన్నా.

తండ్రి: నేనడుగుతోంది దాని బరువు కాదమ్మా!

**అసలు సుత్తి**

జడ్జి: సుత్తి ఆపు తల్లీ.

సావిత్రి: అది మీ చేతులోనే ఉంది కదండీ!

**అనుకోవటం**

అపర్ణ: అందరూ నేను పొడవు దాన్ని అనుకోవాలి- ఏదైనా చిట్కా చెప్పు ప్లీజ్!

సలీమా: వెరీ సింపుల్, పొట్టి వాళ్లతో స్నేహం చెయ్!




# విజేత



*రచన: ఏ. ఎస్. గీతిక, 7 వ తరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

*చిత్రం: శివ, జెయన్‌టియు, హైదరాబాదు.*

కొత్తపల్లిలో దేవి అనే పాప ఉండేది. దేవికి ఒక స్నేహితురాలు ఉండేది. ఆమె పేరు అనసూయ. వాళ్లిద్దరూ బడిలో చక్కగా చదువుకునే వాళ్లు. వాళ్లంటే టీచర్లందరికీ కూడా చాలా అభిమానం.

ఒక రోజున దేవి, అనసూయ బడికి వెళుతున్నారు. అనుకోకుండా అనసూయ జారి పడిపోయింది. రాతి నేల కావటంవల్లనేమో, ఆమెకు చాలా దెబ్బలు తగిలాయి. స్పృహ కోల్పోయింది. దేవి వెంటనే ఆమెను ఆసుపత్రికి తీసుకెళ్లింది. అనసూయకు స్పృహ వచ్చిన తరువాత దేవి ఆమెకు ధైర్యం చెప్పింది. "నీకు తొందరగా బాగవుతుంది, నువ్వేమీ భయపడవద్దు" అన్నది. కొద్ది

రోజులకు అనసూయ కోలుకున్నది. మళ్లీ మామూలుగానే వాళ్లిద్దరూ కలసి స్కూలుకు వెళ్లసాగారు. అయితే ఈఅనుభవం కారణంగా వాళ్ళ స్నేహం మరింత బలపడింది.

ఒక రోజు బడి వార్షికోత్సవం జరుగుతోంది. దేవి, అనసూయ కలసి పాట పాడారు. ఆ తర్వాత పరుగు పందెంలో పాల్గొన్నది దేవి. అనసూయ ట్రాకు పక్కనే కూర్చొని ఉత్సాహంగా చూస్తున్నది. చురుకుగా పరుగెత్తే దేవి ఇప్పుడు అందరి కంటే ముందుగా పరుగెడుతోంది. దేవి గెలుస్తుందన్న సంతోషంతో అనసూయ చాలా సంతోషంగా చప్పట్లు కొడుతూ 'ఇంకా జోరుగా పరుగెత్తు! నువ్వే గెలుస్తావ్! నువ్వే గెలవాలి!' అంటూ అరుస్తోంది. దేవి గెలవాలని మనసులోనే దేవుడికి మొక్కుకుంటోంది. 'దేవుడా, దేవుడా! మా దేవినే గెలిపించు! దేవిని గెలిపించు స్వామీ!' అని వేడుకుంటోంది.

అది 400 మీట ర్ల పరుగు పందెం. దేవి 300 మీటర్ల పైగానే పూర్తి చేసింది. ఆమే ఖచ్చితంగా గెలుస్తుందని అందరూ అనుకుంటున్నారు. అనసూయ సంతోషంతో గాలిలో తేలిపోతోంది. 350 మీటర్లు పూర్తి చేసేసరికి మిగిలిన వాళ్లను ఇంకా దూరంగా పెట్టేసింది. అందరూ "దేవి! దేవి!" అని అరుస్తున్నారు. చాలా ఉత్సాహంగా ఉంది వాతావరణం.

ఇంతలో దేవి వెనక దబ్బుమని శబ్దం వచ్చింది. పరుగెత్తుతూనే వెనకకు తిరిగి చూసింది దేవి. తన వెనకాల పరుగెడుతున్న అమ్మాయి కాలు ఏదో రాయికి దొందురు-కొన్నట్లుంది: ఎదురు దెబ్బ తగిలి ఆ అమ్మాయి పడిపోయింది. మరుక్షణం దేవి ఆగిపోయింది. ఆ పాపను లేవనెత్తేందుకని వెనక్కు తిరిగింది.

బయట కూర్చొని ప్రోత్సహిస్తున్న అనసూయకు కోపం వచ్చింది. 'దేవీ!నువ్వు పరుగెత్తు! వెనక్కు తిరగొద్దు! వేరే వాళ్ళు వచ్చేస్తున్నారు. నిన్ను దాటి పోతారు ' అని అరుస్తోంది. అనసూయలాగే ఇంకొందరు దేవి అభిమానులు కూడా ఇలాగే అరుస్తున్నారు.

దేవి వాళ్ల అరుపుల్ని పట్టించుకోలేదు-వేగంగా వెనక్కి పరుగెత్తుకెళ్లి, పడిపోయిన ఆ అమ్మాయిని లేపింది. గబుక్కున ఆమెను

ఎత్తుకొని షామియానా కిందికి చేర్చింది. అంతలోనే అక్కడికి చేరుకున్న టీచర్లు పడిపోయిన ఆ పాపకు కట్టుకట్టి, ప్రథమ చికిత్స చేశారు.

పరుగుపందెంలో ఇంకెవరో గెలిచారు. దేవి మిత్రురాలు అనసూయకు ఇది చాలా బాధగా ఉంది. 'ఈ దేవి చూడు! ఫస్టు ప్రైజును స్వయంగా పోగొట్టుకున్నది. తనొక మదర్ థెరీసా అనుకున్నదేమో! ఎవరికీ లేని సేవాగుణం తనకెందుకో? పడిపోయిన ఆ అమ్మాయిని తనే పట్టించుకోవాలా? బుద్ధిగా పరుగెత్తి ఫస్టు ప్రైజు తెచ్చుకోవచ్చు గదా!' అని చిటపటలాడింది. పోటీ పూర్తయ్యాక ఇక అనసూయ దేవితో మాట్లాడలేదు. ఆ సాయంత్రం వరకు దేవికి కనబడకుండా తప్పించుకొని తిరిగింది.

సాయంత్రం బహుమతి ప్రధానోత్సవం. పండుగ వాతావరణం కనిపిస్తోంది. చాలా మంది అతిథులు, తల్లిదండ్రులు వచ్చారు. పరుగు పందెపు విజేతలకు బహుమతులు ఇచ్చారు. దేవి సంతోషంగానే ఉన్నది, కానీ అనసూయ ముఖం మాత్రం వాడిపోయి ఉన్నది.

ఆ వెంటనే హెడ్మాస్టారు గారు మైకు దగ్గరకొచ్చారు. ఉదయం జరిగిన పరుగు పందెపు విశేషాలు చెప్పారు. ఒక పాపకు ఎంత దెబ్బలు తగిలాయో చెప్పారు. ఆ పాపను దేవి ఎలా కాపాడిందో చెప్పారు. "ఈ పరుగు పందెంలో నిజమైన విజేత దేవి!" అని చెప్పి, ఆమెను స్టేజి పైకి ఆహ్వానించారాయన. పిల్లలు దేవిని మెచ్చుకుంటూ చప్పట్లు కొడుతుంటే, ఒక పెద్ద పూలమాలతో ఆమెను సత్కరించారు హెడ్మాస్టారు గారు.

స్టేజి దిగి వస్తున్న దేవిని అనసూయ ఆరాధనా పూర్వకంగా చూసి, నవ్వుతూ ఆమె దగ్గరికి పరుగెత్తింది.




# దురాశ

*సేకరణ, కథనం: V.విష్ణు, ఏడవతరగతి, ప్రకృతిబడి.*

*చిత్రాలు: అడవి రాముడు, జెయన్‌టీయు, హైదరాబాదు.*



అనగనగా ఒక ఊరు . ఆ ఊరిలో ఒక పేద కుటుంబం ఉండేది. ఆ కుటుంబ యజమాని సీతయ్య. ప్రతి రోజూ అతను దగ్గరలోని అడవికి వెళ్ళి, కట్టెలు కొట్టుకొచ్చి, వాటిని గ్రామంలో అమ్మి, తన కుటుంబాన్ని పోషించేవాడు. అంత పేదరికంలో కూడా ఇతరులకు సాయపడేవాడు.

ఒక ఏడాది కరువు వచ్చి పంటలు సరిగ్గా పండలేదు. ఊళ్లో జనాల దగ్గర డబ్బు లు తక్కువ అవ్వటంతో, ఆ ప్రభావం సీతయ్య కట్టెల వ్యాపారం మీద పడింది. కట్టెలు కొనేవాళ్ళ సంఖ్య బాగా తగ్గి పోయింది.

సీతయ్య కుటుంబానికి పూట గడవటమే కష్టమైపోయింది.

ఒకనాడు సీతయ్య కట్టెల కోసం అడవికి వెళ్ళాడు. కట్టెలు కొడుతుండగా మధ్యలో దాహం వేసింది. దగ్గర్లోని చెలమకు పోయి, నీళ్ళు తాగి, "అమ్మో! ఎంత కష్టంవచ్చిందమ్మో నాకు!" అని నిట్టూర్చాడు. వెంటనే ఒక వనదేవత ప్రత్యక్షమయింది: 'ఏమి కావాలో కోరుకో'మన్నది!

సీతయ్య తన కష్టాలన్నింటినీ ఆ దేవతకు చెప్పుకున్నాడు. అప్పుడు వనదేవత సీతయ్యకు మూడు టెంకాయలు ఇచ్చి "ఈ మూడు టెంకాయలనూ కొడుతూ నువ్వు ఏమి కోరుకుంటే అది జరుగుతుంది నాయనా" అని చెప్పి మాయమైపోయింది.

సీతయ్య సంతోషంగా ఇంటికి వెళ్ళి టెంకాయలను కొడుతూ, తనకు ఒక పెద్ద భవనమూ, దండిగా సంపదా, తమ ప్రాంతం మొత్తానికి సకాల వర్షాలు కావాలని కోరుకున్నాడు. అతని కోరిక ప్రకారమే అన్నీ జరిగాయి.

సీతయ్య ఇంటి పక్కనే ఒక పిసినారి పుల్లయ్య ఉండేవాడు. వ్యాపారంలో బాగా సంపాదించి డబ్బులు కూడ బెట్టాడు అతను. అతనికి రెండు గాడిదలు ఉండేవి. అవంటే అతనికి ఎంతో ఇష్టం కూడాను.

కట్టెలుకొట్టే సీతయ్య ఒక్క రోజులో షావుకారి అయిపోవడం పిసినారి పుల్లన్నకు ఆశ్చర్యం కలిగించింది. సీతయ్య దగ్గరికి వెళ్లి 'విషయం ఏంటి' అని అడిగాడు. పుల్లయ్య అంటే గౌరవభావం ఉన్న సీతయ్య, ఏమీ దాచుకోకుండా జరిగినదంతా చెప్పేశాడు అతనికి.

మరుసటి రోజు పిసినారి పుల్లన్న అడవికి బయలు దేరిపోయి, నీటి చెలమ దగ్గర కూర్చొని "అమ్మో! ఎంత కష్టం వచ్చిందమ్మో నాకు!" అని మొత్తుకున్నాడు. వెంటనే వనదేవత ప్రత్యక్షమైయింది; సీతయ్యకు ఇచ్చినట్లే మూడు టెంకాయలను ఇచ్చి మాయమై పోయింది.

పుల్లన్న ఇంటికి వెళ్ళి , మొదటి టెంకాయ కొట్టబోతున్నాడు. అంతలో ఒక బిక్షగాడు

వచ్చి ఇంటి బయట నిల్చొని, " బాబూ! ధర్మం బాబూ!" అని అరిచాడు.

"శుభమా , అని టెంకాయ కొడుతుంటే, వీడొకడు తగలబడ్డాడు" అని కోపగించుకున్న పుల్లన్న, కొబ్బరికాయను కొడుతూనే, "నువ్వొక్కడివీ వస్తే ఎలా సరిపోతుంది గాడిదా, మరో వెయ్యి గాడిదల్ని వెంట బెట్టుకు రాకపోయావూ!?" అన్నాడు వెటకారంగా.




టెంకాయ మహత్యం! మరుక్షణం పుల్లన్న ఇల్లంతా గాడిదలతో నిండిపోయింది.

"ఇదేమిటీ, ఇలా జరిగింది?" అని కంగారు పడ్డాడు పుల్లన్న . ఆ కంగారులో రెండవ టెంకాయను కొడుతూ "అమ్మా! ఈగాడిదలన్నింటినీ తీసేసుకోమ్మా!" అన్నాడు. తక్షణం అతని సొంత గాడిదలతో సహా అక్కడున్న అన్ని గాడిదలూ మాయమయ్యాయి.

"అయ్యో! నాప్రియమైన రెండు గాడిదలు! అవి పోతే ఎలా?" అంటూనే మూడవ టెంకాయను కొట్టాడుపుల్లన్న. కళ్లుమూసి తెరిచేసరికి, అతని రెండు గాడిదలూ అతనికి తిరిగి వచ్చేశాయి!

మూడు టెంకాయలు అయిపోయాయి- కానీ వనదేవతవల్ల ఏ లాభమూ పొందలేకపోయాడు, పాపం పుల్లన్న! ఆ తర్వాత అతను ఎంత నిట్టూర్చినా వనదేవత మాత్రం ప్రత్యక్షం కాలేదు!




# గంధర్వ కన్యలు



*అనంతపురం జిల్లా జానపద కథ*

*కథనం: V. రాజు, 6 వతరగతి, ప్రకృతి బడి.* *చిత్రాలు: గణేష్, జెయన్‌టియు, హైదరాబాదు.*

అవంతీపుర రాజ్యాన్ని ప్రతాప వర్మ మహారాజు పరిపాలించేవాడు. ఆయనకు ఏడుగురు కొడుకులు. రాజకుమారులందరూ చాలా తెలివైన వారు. వాళ్లలో చిన్న యువరాజు చాలా అందంగా కూడా ఉండేవాడు. వీళ్లందరికీ పట్టాభిషేకం చెయ్యాలని అనుకున్నాడు మహారాజు- కానీ అంతకంటే ముందే వారికి పెళ్ళి చేయాలి! అందుకోసమని, 'ఒకే ఇంట్లో పుట్టిన ఏడుగురి అమ్మాయిలను' వెతికి తన కొడుకులకు ఇచ్చి పెళ్లి చేయాలనుకున్నాడు.

అయితే ఆరాజ్యంలో ఎంత వెతికినా 'ఒకే ఇంట్లో పుట్టిన ఏడుగురు అమ్మాయిలు' దొరకలేదు!

అందుకని రాజుగారు భటుల్ని పక్క రాజ్యానికి పంపించి 'ఒకే ఇంట్లో పుట్టిన ఏడుగురి అమ్మాయిలను వెతకమ'న్నాడు. వెతకగా వెతకగా వాళ్ళకు ఒకే ఇంట్లో పుట్టిన ఏడుగురు అమ్మాయిలు కనిపించారు. ఈ విషయం

వాళ్ళు వెంటనే తమ మహారాజుకు తెలియజేశారు.

రాజుగారు చాలా సంతోషించారు. వెంటనే ప్రక్క రాజ్యానికి వెళ్ళి, ఏడుగురు అమ్మాయిలను చూడమని పంపించారు కొడుకులను. ఏడుగురు రాజ కుమారులూ ప్రక్కరాజ్యానికి వెళ్ళి చూస్తే అక్కడ ఒకే ఇంట్లో పుట్టిన ఏడుగురు అమ్మాయిలూ చక్కని సుందరీమణులు! చూసీ చూడగానే నచ్చారు వాళ్ళు! రాజకుమారులకు, వాళ్ళకు ఘనంగా పెళ్ళిళ్ళు జరిగాయి.

ఆ తర్వాత అందరూ బయలు దేరి తమ రాజ్యానికి తిరిగి వస్తుండగా, మధ్య దారిలోనే చీకటి పడింది. "ఈ రాత్రికి ఇక్కడే పడుకుందాం" అని, అందరూ అక్కడే గుడారాలు వేసుకొని పడుకున్నారు.

అయితే అడవిలోని ఆ ప్రదేశం గంధర్వులకు చాలా ఇష్టమైనది. ప్రతిరోజూ రాత్రిపూట కనీసం నలుగురు గంధర్వ కన్యలు అక్కడికి వచ్చేవాళ్ళు. అలాగే ఆరోజు కూడా అక్కడికి వచ్చారు నలుగురు! తీరా చూస్తే అక్కడ గుడారాలు వేసి ఉన్నాయి. గంధర్వ కన్యలు కుతూహలం కొద్దీ గుడారాల్లోకి తొంగి చూసారు.

గుడారాల్లోపడుకున్న రాజకుమారుల్లో చిన్నవాడు అందరి కంటే అందంగా అనిపించాడు వాళ్ళకు. వెంటనే గంధర్వ కన్యలు కూడబలుక్కుని, వాడిని మాయం చేసి తమతోబాటు తమ లోకానికి తీసుకొని వెళ్ళిపోయారు!

తెల్లవారింది. అందరూ నిద్ర లేచారు- కానీ చిన్న యువరాజు మాత్రం ఎక్కడా కనిపించలేదు.

కొంచెం సేపు వెతికిన తర్వాత, 'అతన్ని ఏ క్రూరమృగమైనా ఎత్తుకెళ్లిందేమో' అని అనుమానించారు అందరూ. 'బ్రతికి ఉంటే తనే వస్తాడులే, ఎంతని వెతుకుతాం? మనం వెళ్దాం పదండి' అని అందరూ వాళ్ళ రాజ్యానికి బయలుదేరారు.

కానీ చిన్న రాణికి అట్లా ముందుకు వెళ్ళబుద్ధి కాలేదు. అలాగని తన పుట్టినింటికి వెళ్లటమూ ఇష్టం కాలేదు. మిగతావాళ్లనందరినీ వెళ్ళనిచ్చి,

తను మాత్రం భర్తకోసం వెతుకుతూ అడవిలోనే ఉండిపోయింది.

ఆకలి దప్పులు పట్టించుకోకుండా ఆమె అడవి మొత్తం గాలించింది- ఎక్కడా భర్త జాడ లేదు.

చివరికి అదృష్టవశాత్తు చెట్టు కింద కూర్చొని తపస్సు చేసుకుంటున్న ఋషి ఒకాయన కనబడ్డాడు ఆమెకు.

అయితే నాగుపాము ఒకటి, ఆ ఋషి ముందు నిలబడి, ఆయన్ని కాటు వేయబోతున్నది! చిన్న రాణి వెంటనే సమయస్ఫూర్తిని ఉపయోగించింది: ముందుగా చేతికందిన కట్టెతో శబ్దం చేస్తూ ఆ పాము దృష్టిని మరల్చింది- ఆపైన ఒక్కసారిగా ఆ పామును కట్టెతో ఎత్తి, దూరంగా విసిరేసింది.

కొంత సేపటికి కళ్ళు తెరచిన ఋషి, చిరునవ్వు నవ్వుతూ "ఎవరమ్మా నువ్వు? ఇంత ఘోరమైన అడవిలో ఒక్కదానివీ తిరుగుతున్నట్లున్నావే? నీకు ఏదో కష్టం ఎదురైనట్లుంది. నన్ను పాము బారినుండి కాపాడావు కదా, నువ్వు? నాకు తెలుసులే, నీకెదురైన కష్టాల్ని నేను తీరుస్తాను" అన్నాడు.

అప్పుడు రాణి తన కథను వివరించింది.

అప్పుడు మహర్షి కొద్దిసేపు కళ్ళుమూసుకొని, సర్వం తెలుసుకున్నాడు. 'నీ భర్తను గంధర్వ కన్యలు ఎత్తుకెళ్ళారు తల్లీ! వాళ్ళ గర్వం అణగే సమయం దగ్గరపడింది. ఒకానొక శాపకారణంగా ఆ గంధర్వ కన్యలకు ఏది మంచో ఏది చెడో తెలీకుండా పోయింది. నేను చెప్పినట్లు చెయ్యి - ఆ కొలనులో ఒక కుండ ఉంది. కొలనులోకి దూకి, నీటి అడుగున ఉన్న కుండను బయటికి తెచ్చి, దానిపైన సూర్య కిరణాలను ప్రసరింపజేశావంటే, ఆ కన్యలను కప్పిన శాపపు పొర వీడిపోతుంది. దాంతో వాళ్లకు మంచి చెడులు అర్థమౌతాయి. నీ భర్త నీకు లభిస్తాడు. చింతించకు" అని చెప్పాడు.

చూస్తే కొలనులో మొసళ్ళు ఉన్నై! మరెలా? అయినా గాని చిన్న రాణి ధైర్యంతో కొలనులో దిగి ఆ కుండ కోసం వెతికి వెతికి , చివరికి కొలను అడుగున నాచులో దాగిన కుండను కనుగొన్నది. ఆ కుండ పైన సూర్య కిరణాలు పడగానే, గంధర్వ కన్యల మైకం

వదిలిపోయింది. వాళ్ళిప్పుడు రాజ-కుమారుడిని చూసి "అయ్యో , ఇదేమిటి? ఇతన్ని ఎందుకు తీసుకొచ్చాం?" అని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పి, అనేక బహుమతులిచ్చి వెనక్కి తెచ్చి విడిచారు.

రాకుమారుడు , చిన్న రాణి మహర్షికి ధన్యవాదాలు చెప్పుకొని, వాళ్ళ రాజ్యానికి తిరిగి వెళ్ళారు.

అప్పటికే మహారాజు తన చిన్న కుమారుడినీ, చిన్న కోడలినీ వెతికేందుకు పెద్ద సైన్యాన్నే పంపించబోతున్నాడు. వాళ్ళే క్షేమంగా తిరిగి వచ్చినందుకు ఆయన ఎంతో సంతోషించాడు.

అటుపైన యువరాజూ రాణీ సుఖంగా జీవించారు.

జోకులు

**ఒకే గొడుగు!**

ఎండాకాలం : వర్షాభావం వల్ల రిజర్వాయర్లు ఎండిపోవడంతో అధికారికంగా విద్యుత్ సరఫరా 6 గంటలు తగ్గించడమైనది.

వర్షా కాలం : అధిక వర్షాల కారణంగా కరెంట్ తీగలు తెగి పడిపోయి-నందువల్ల విద్యుత్ సరఫరా నిరవధికంగా నిలిపివేయడమైనది.

**పాత జోకే!**

రాజు విమానంలో బాంబేకి వెళుతున్నాడు.అది ల్యాండ్ అవుతుంటే ఆనందంతో పెద్దగా అరిచాడు: " BOMBAY , BOMBAY” అని.

ఎయిర్ హాస్టెస్: బీ సైలెంట్.

రాజు: " OMBAY , OMBAY”




# పట్టిందల్లా బంగారం

*మూలం: King Midas' golden touch.*

*సేకరణ, కథనం: N.మాధవి,5 వతరగతి,విజ్ఞంస్కూల్.* *చిత్రాలు: శివ, జెయన్‌టీయు, హైదరాబాదు*

అనగా అనగా ఒక ఊళ్లో భూపతి అనే వ్యాపారి ఉండేవాడు. ఆయన చాలా ధనవంతుడు. బంగారు వ్యాపారం చేసేవాడు; ఎంతో కూడ బెట్టాడు-కానీ అతనికి బంగారం అంటే విపరీతమైన మోజు ఉండేది. భూపతికి ఒక చిన్నారి ముద్దుల పాప ఉండేది. ఆయనకు తన కూతురు అంటే కూడా చాలా ఇష్టం.

ఒక రోజున, భూపతి దేవుణ్ని ప్రార్థిస్తూ ఉండగా, అకస్మాత్తుగా ఆ దేవుడే ప్రత్యక్షమయ్యాడు: "భూపతీ! నీ భక్తి నాకు నచ్చింది. నీకు ఒక వరం ఇద్దామనిపిస్తున్నది. ఏం వరంకావాలో కోరుకో" అన్నాడు దేవుడు.

భూపతి సంతోషంతో పులకించి పోయాడు. "ఏం వరం అడిగినా ఇస్తారు కదా స్వామీ!" అని

అడిగాడు, ముందస్తుగా.



"వరాన్ని బట్టి ఉంటుంది. కోరుకో, ముందు" అన్నాడు దేవుడు.

"నేను పట్టిందల్లా బంగారం కావాలి దేవుడా"అని కోరుకున్నాడు భూపతి.

"సరే, నువ్వు కోరిన వరం ఇచ్చేస్తున్నాను మరి- జాగ్రత్తగా ఉపయోగించుకో " అని చెప్పి దేవుడు మాయమయిపోయాడు.

భూపతికి చాలా సంతోషం వేసింది. 'ప్రయత్నించి చూద్దాం' అని చెప్పి ఒక గాజు బొమ్మను ముట్టుకున్నాడు- తక్షణం ఆ గాజుబొమ్మ బంగారు బొమ్మగా మారిపోయింది!



మంచాలనీ, కుర్చీలనీ ముట్టుకున్నాడు. అవికూడా వెంటనే బంగారు మంచాలు, బంగారు కుర్చీలు అయిపోయాయి. భూపతికి మహదానందం అయ్యింది. తన ఇంట్లోని ఒక్కొక్క వస్తువునీ గుర్తు చేసుకొని, వెళ్ళి వాటిని ముట్టుకున్నాడు. అవన్నీ బంగారం అయిపోయాయి!

అప్పటికి ఇక మధ్యాహ్నం అయ్యింది. భూపతికి ఆకలయ్యింది. భోజనం చేద్దామని వంట గదిలోకి వెళ్ళి, ప్లేటును ముట్టుకున్నాడు. వెంటనే ఆ ప్లేటు కాస్తా బంగారమైపోయింది. భూపతి సంతోషంగా నవ్వుకుంటూ అన్నం గిన్నెను ముట్టుకొని

చూశాడు- అదీ బంగారం అయిపోయింది.



'సరేలే, ఇప్పటికి ఈ ఆట చాలు. ఆకలి బాగావేస్తోంది. అన్నం తిందాం' అని అన్నం పెట్టుకొని తినబోయాడు. ముద్ద నోటిని చేరేలోగా బంగారు ముద్ద అయిపోయింది! బంగారాన్ని ఎవరైనా ఎట్లా తింటారు?

భూపతి అప్పుడు కొంచెం కంగారు పడ్డాడు. "పోనీలే, కనీసం మంచినీళ్ళైనా తాగుదాం" అని గ్లాసును చేతిలోకి తీసుకున్నాడు. నీళ్లు పెదాలను తాకాయో లేదో- బంగారం అయిపోయాయి!

భూపతికి ఇక ఏంచేయాలో తోచలేదు. ఒక వైపున ఆనందం, మరోవైపు బాధ- "ఇందులో ఏదో కిటుకు ఉంటుంది- నిదానంగా ఆలోచించి చూస్తే తెలుస్తుంది" అనుకున్నాడు.



అంతలోనే భూపతి కూతురు బడి నుంచి వచ్చింది- భూపతిని చూడగానే ఆ పాప "నాన్నా!" అని అరుచుకుంటూ దగ్గరికి వచ్చింది. భూపతి ఒక్క క్షణం పాటు తన బాధను మరిచిపోయి, ఆ పాపను ఎత్తుకుని ముద్దు చేయబోయాడు- అంతే- ఆ పాప కూడా బంగారు బొమ్మ అయిపోయింది- ఎంత పిలిచినా ఉలకదు, పలకదు!

భూపతికి పిచ్చెక్కినట్లు అయ్యింది. "పాపా! పాపా!" అని విపరీతంగా ఏడ్చాడు. "ఈ దరిద్రపు వరం నాకొద్దు- నా పాప ఉంటే చాలు నాకు- దేవుడా, ఈ వరం వెనక్కు తీసేసుకో,

ప్లీజ్! రా ఒక్కసారి. నాకీ బంగారం అవసరం లేదు" అని ఏడ్చాడు.

ఆ ఏడుపు చూసి దేవుడికి కూడా జాలి వేసింది. వెంటనే మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు దేవుడు- "ఏల? వరాన్ని ఇంత తొందరగా వద్దంటున్నావు? నువ్వు ముట్టిందల్లా బంగారం అవుతున్నది గద!" అని అడిగాడు అమాయకంగా.



భూపతి చెంపలు వేసుకుని దేవుడి కాళ్ళమీద పడ్డాడు- "స్వామీ! నాకు బుద్ధొచ్చింది. ఇక ఎప్పుడూ అత్యాశకు పోను. ఈ వరం నాకు వద్దు. నా జీవితం మునుపటి మాదిరి ఉంటే చాలు. ఉన్నదాంట్లో సంతృప్తి పడతాను. ఇంకా ఇతరులకూ సాయం చేస్తాను. ప్లీజ్! ఇది వరంకాదు; శాపం. ఈ శాపాన్ని వెనక్కి తీసేసుకో" అని వేడుకున్నాడు.

దేవుడు చిరునవ్వుతో "తథాస్తు" అని మాయమైపోయాడు.

భూపతి చెయ్యి తగిలి బంగారం అయిపోయినవన్నీ వెంటనే మళ్లీ మామూలుగా అయిపోయాయి. బంగారు బొమ్మగా మారిన బిడ్డకూడా మామూలుగా అయిపోయి కిలకిలలాడింది. భూపతి సంతోషంతో ఆ పాపను ఎత్తుకొని ముద్దాడి, తృప్తిగా కళ్ళనీళ్ళు తుడుచుకున్నాడు.

# జారు బాబూ!

కొత్తపల్లి పత్రిక అక్టోబరు సంచికలో ఇచ్చిన బొమ్మకు స్పందన.

రచన, చిత్రం: Y. గీతాప్రియ దర్శిని, ఇంటర్మీడియట్, నలందా జూనియర్ కాలేజి, నంద్యాల.



రామ్ నగర్ లో ఒక పిల్లల పార్కు ఉంది. ఆ పార్కు ఇళ్ళ మధ్య ఉండేది. పిల్లలు పార్కులో ఆడుకోవడానికి టిక్కెట్టు కొనుక్కోవాలి. తల్లిదండ్రులు కూడా 'పిల్లలు హోంవర్కు పూర్తి చేస్తే పార్కు టిక్కెట్టు కొనిపిస్తాము' అనేవాళ్ళు. దాంతో పిల్లలు తొందరగా హోంవర్కు ముగించుకొని, గబగబా పార్కుకి పరుగెత్తేవాళ్ళు.

ఆ పార్కులో ఒక తోటమాలి తాత ఉండేవాడు. ఆ తాత చాలా మంచి వాడు. ఒక రోజు రవి ఆడుకోవటానికి వచ్చాడు అక్కడికి. కొత్తకదా, అందుకని జారుడు బండ జారడానికి చాలా భయపడ్డాడు అతను. అప్పుడు తోటమాలి తాత "భయపడకు బాబూ! ఇది చాలా సులభం" అంటూ ధైర్యం చెప్పాడు. సహజంగానే అటుపైన రవికి జారుడు బండ అంటే భయం పోయింది. అప్పటి నుండి రవి రోజూ తాత దగ్గరికి వచ్చి, కొంచెం సేపు కబుర్లు చెప్పిగానీ ఇంటికి వెళ్ళేవాడు కాదు.

ఇలా ఉండగా ఒక రోజు రవికి ఒక కొత్త సంగతి తెలిసింది: తాత యజమాని తాతకు సరిగా జీతం ఇవ్వట్లేదు. తాతను ఇబ్బంది పెడుతున్నాడు. ఆ విషయం తెలియగానే రవికి చాలా బాధ వేసింది. 'తాతకి ఎలాగైనా సహాయం చేయాలి' అనుకున్నాడు.

పార్కు యజమాని రోజూ టిక్కెట్టు కౌంటరు దగ్గర కూర్చుంటాడు. అతన్ని చూసాక, రవికి ఒక ఉపాయం తట్టింది. అతను తన స్నేహితులందరినీ పిలిచి విషయమూ, తన ఉపాయమూ చెప్పాడు. పిల్లలందరూ 'సరే' అన్నారు. రవి తాతను పిలిచి, తను చెప్పినట్లు చేయమన్నాడు. తాత ముందు కొంచెం తటపటాయించాడు; కానీ చివరికి సరేననక తప్పలేదు.

ఆ రోజు పార్కు తెరిచే సమయానికి, పార్కు యజమాని సుబ్బారావు దగ్గరికి వెళ్ళి, తన జీతం పెంచమని అడిగాడు తాత. సుబ్బారావు కుదరదన్నాడు. వెంటనే తాత తను ఉద్యోగం మానేస్తున్నానని చెప్పేశాడు. నెలాఖరుకు వచ్చి చేసినంత వరకు జీతం తీసుకువెళతానని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రోజు సాయంత్రం, ముందుగా రవి పార్కుకు వెళ్ళి టిక్కెట్టు తీసుకుని లోపలికి వెళ్ళి, వెనక్కి తిరిగి వచ్చేసాడు. అటుపైన ఒకరి తరవాత ఒకరుగా పిల్లలందరూ వచ్చారు. రవి వాళ్ళందరికి ఏదో చెప్తూ ఉన్నాడు. కొంచెం సేపటికి పిల్లలంతా వెళ్ళిపోయారు.

ఇదంతా చూసి పార్కు యజమాని సుబ్బారావు ఆశ్చర్యపోయాడు. ఏం జరుగుతున్నదో అతనికి అర్థం కాలేదు. మరుసటి రోజు కూడా ఇలాగే జరిగింది. కాకపోతే పిల్లలు ఈ రోజు వెళ్ళిపోలేదు- సుబ్బారావు దగ్గరకు వచ్చి "తాత ఏడి, కనిపించటం లేదు?" అని అడిగారు.




సుబ్బారావు ఆశ్చర్యంగా వాళ్ళవైపు చూస్తూ "తాత పని మానేసాడు" అని చెప్పాడు. అంతే- మరుసటి రోజు నుండి పిల్లలు రావడం పూర్తిగా మానేసారు. కనీసం ఒకళ్ళు ఒక టిక్కెట్టు కూడా

కొనడం లేదు.

ఇట్లా రెండురోజులు గడిచేసరికి, సుబ్బారావుకు బుద్ధి వచ్చింది. 'తాత లేకపోతే తనకు అసలు ఆదాయమే ఉండదు! తాత జీతం విషయంలో తను మరీ జిడ్డుగా ఉండకూడదు" అని అర్థం అయ్యింది. ఇంకో రెండు రోజులు ఇట్లా గడిచింది- తాతను పిలిపించి, జీతం పెంచి మరీ పనిలో చేర్చుకున్నాడు సుబ్బారావు.

పిల్లలు, తాత కూడా సంతోష పడ్డారు. పార్కు మళ్ళీ పిల్లలతో కళకళలాడింది.

**నలుపు-తెలుపు** **జోకులు**

టీచర్: అన్నింటి కంటే పాత జంతువు ఏది?

స్టూడెంట్: జీబ్రా సార్!

టీచర్: ఎందుకని.

స్టూడెంట్: అది ఇంకా నలుపు, తెలుపు రంగులోనే ఉంటుంది కాబట్టి.

**అమాయకుడు!**

మారుతి విదేశయాత్ర ముగించుకొని, ఇంటికొచ్చాడు.

మారుతి: నేను ఫారెనర్ లా కనిపిస్తున్నానా!?

మారుతి భార్య: లేదే, ఎందుకలా అడిగారు?

మారుతి: ఏం లేదు, లండన్ లో నన్ను చాలా మంది 'నువ్వు ఫారెనర్ వా?' అని అడిగారెందుకు, మరి?

# విశాల హృదయం - విశాల రాజ్యం

*రచన: జి. జయచంద్రారెడ్డి, ఉపాధ్యాయులు, టింబక్టు బడి.*

*చిత్రం: శివ, జెయన్‌టియు, హైదరాబాదు.*



అనగా అనగా ఒక రాజ్యం ఉండేది. ఆ రాజ్యం పేరు విశాల రాజ్యం. ఆరాజ్యానికి రాజు విశాలుడు. పేరుకు తగ్గట్లుగా ఆ రాజు హృదయం విశాలమైనది. రాజు రాజ్యాన్ని బాగా పరిపాలించేవాడు. ప్రజలను కన్నబిడ్డల్లాగా చూసుకునేవాడు. అందుకు తగిన విధంగానే ప్రజలు కూడా ఆయన పట్ల వినయ విధేతలు కలిగి ఉండేవాళ్లు. కష్టపడి పని చేసేవాళ్ళు.

రైతులందరితో పాటు రాజు కూడా వ్యవసాయం చేసేవాడు. మంచి మంచి పంటలు పండించేవాడు.

రైతులందరికి పంటలు పండించడంలో

మెళుకువలు చెప్పి, మంచి నాణ్యమైన పంటలు పండించేట్లు చూసేవాడు విశాలుడు. తను రాజునన్న గర్వం ఏనాడూ ఉండేది కాదు ఆయనకు. ఇతర రాజ్యాలలో వున్న వ్యాపారస్తులంతా నాణ్యమైన సరుకు కోసం విశాల రాజ్యానికి వచ్చేవారు. అందువల్లకూడా, విశాలరాజ్యంలోని రైతులకు మంచి లాభాలు వచ్చేవి. ఆ ఉత్సాహంతో రైతులు ఇంకా నాణ్యమైన పంటలను పండించేవారు. ఆ విధంగా ఆ రాజ్యం నాణ్యమైన సరకులకు పెట్టిన పేరైంది.

కొన్నిసంవత్సరాల తరువాత ఆ రాజు ఆ రాజ్యంలోని రైతులందరినీ సమావేశపరిచి, "నేను కొన్ని రోజులు విశ్రాంతి తీసుకోవాలని నిర్ణయించుకున్నాను. రాజ్యం వదలి అడవులకు వెళ్ళి తపస్సు చేసుకుంటాను. ఈ రోజు సుదినం. సాయంత్రంగానే నేను ప్రయాణమై పోతాను. ఇన్నేళ్ళుగా మీరు తెలుసుకున్న మెళకువలతో మంచి మంచి పంటలు పండిస్తూ పోండి. మన రాజ్య కీర్తి ప్రతిష్టలను ఇంకా ఇనుమడింప జేయండి " అని ముగించాడు.

రైతులందరూ చాలా బాధపడ్డారు. రాజు మాటలకు ఎదురు చెప్పలేరాయె! విచారంగా ముఖాలు వేళ్ళాడ వేసుకొని ఇళ్ళకు చేరుకున్నారు. ఆ రోజు సాయంత్రం రాజుగారు అడవులకు వెళ్ళిపోతూ ఉంటే ఆ రాజ్యం లోని ప్రజలందరూ బాధపడి, ఏడుస్తూ చూస్తుండి పోయారు. అటు తరువాత కూడా ఆ రైతులు రాజుగారిచ్చిన విలువైన సలహాలను పాటిస్తూ మంచి నాణ్యమైన పంటలు పండించారు. గొప్ప లాభాలు పొందారు; ధనవంతులయ్యారు.

నిదానంగా వాళ్లంతా మంచి భవనాలు కట్టించుకుని విలాసవంతమైన జీవితానికి అలవాటు పడిపోయారు. రాజును పూర్తిగా మరచిపోయారు. పంటలు పండించడం మానుకున్నారు.

కొంత కాలానికి వారు పూర్తిగా సోమరులుగా తయారయ్యారు. వాళ్ళ దగ్గరున్న డబ్బులు మంచులాగా కరిగిపోతూ వచ్చాయి. వాళ్ళు ఇష్టపడి కట్టించుకున్న ఇండ్లు సైతం అమ్ముకోవలసి వచ్చింది. అయినా వాటిని

కొనేవాళ్ళు కూడా లేరు! ధనవంతులు బికారులయ్యారు. ఆ రాజ్యంలో అంతటా కరువు తాండవం ఆడసాగింది. ప్రజలు ఆకలితో మాడుతున్నారు. అప్పుడు వాళ్లకు రాజుగారు గుర్తుకు వచ్చారు. అయినా ఏం లాభం? ఏమీ ప్రయోజనం లేకపోయింది.

రైతులు సోమరులుగా మారడంతో పంటలు పండించలేకపోయారు. వర్షాలు కూడా సరిగా పడటం లేదు. కొంత కాలానికి రాజుగారు రాజ్యానికి తిరిగి వచ్చారు. రాజ్య స్థితిగతులను చూసారు. అక్కడ ఒక క్షణం కూడా ఉండలేక, తిరిగి అడవులకు వెళ్ళిపోయారు.

'విశాల హృదయాలు లేని విశాల రాజ్యం నాకెందుకు?' అని రాజుగారికి అనిపించి ఉంటుంది.

**సున్నకు కొత్త విలువ** **జోకులు**

రవి : ' సున్నకు ' విలువ లేదా?

గోపి: లేదు.

రవి: సున్న పక్కన సున్న పెడితే?

గోపి : ఏమీ కాదురా!

రాము: సున్నం అవుతుంది గదరా?

**తేడా !**

టీచర్ : ఆపిల్‌పండు క్రింద పడగానే ఎందుకు క్రిందకు పడిందా ! అని న్యూటన్ ఆలోచించాడు , కదా ! మరి నువ్వైతే?

స్టూడెంట్: పడగానే తినేసి, రెండోది ఎప్పుడు పడుతుందా, అని చూస్తుంటా!




# మన రాత మన చేతల్లోనే ఉంది

*మూలం: “Buddhist Parables”* *తెలుగు అనుసరణ: నారాయణ*

*చిత్రాలు: శివ, జెయన్‌టియు, హైదరాబాదు.*

చాలా కాలంక్రితం ముసలి సన్యాసి ఒకాయన ఉండేవాడు. ఆయన సాధన బలం గొప్పది- అందువల్ల ఆయనకు కొన్ని అద్భుత శక్తులు కూడా సమకూరాయి. వాటిలో ఒకటి, మానవుల తలరాతను చూడగలగటం.

ఆయన దగ్గర చాలామంది శిష్యులు ఉండేవాళ్ళు. వాళ్ళలో ఎనిమిదేళ్ళ పిల్లవాడు కూడా ఒకడు ఉండేవాడు. ఒక రోజున ఆయన ఆ పిల్లవాడి ముఖం కేసి చూసీ చూడగానే ఆయనకు వాడి భవిష్యత్తు తెలిసిపోయింది: పిల్లవాడి ఆయుష్యు అయిపోవచ్చింది.. కొద్ది రోజుల్లో వాడు మరణించనున్నాడు!

గురువు గారికి ఆ పిల్లవాడిని చూస్తే బాధ వేసింది. చనిపోయేటప్పుడు ఆ పిల్లవాడు తన

తల్లి దండ్రుల దగ్గర ఉంటే మంచిదని ఆయనకు అనిపించింది. అందుకని ఆయన పిల్లవాడిని దగ్గరికి పిలిచి, "నాయనా! నువ్వు కొంతకాలంపాటు శలవు తీసుకొని, మీ యింటికి వెళ్ళు. వీలైనన్ని రోజులు మీతల్లిదండ్రులతో సంతోషంగా గడుపు. వెనక్కి తిరిగి రావాలని తొందర పడకు" అని చెప్పి, ఇంటికిపంపించాడు.

మూడు నెలలు గడిచాయి. ఆ పిల్లవాడు చనిపోయి ఉంటాడనుకున్నారు గురువుగారు. అయితే ఒక రోజున, గురువుగారు కొండ మీద కూర్చొనిక్రిందికిచూస్తూ ఆశ్చర్యపోయారు- ఆ పిల్లవాడు వెనక్కితిరిగివస్తున్నాడు!

అతని ముఖంలోకి తదేకంగా చూసిన గురువుగారికి ఇప్పుడు అతను పండు ముసలివాడయ్యేంత వరకూ జీవిస్తాడని అర్థమైంది!

"ఏమి చేయటం వల్ల, అతని రాత ఇంతగా మారింది?" అని గురువుగారికి ఆశ్చర్యం వేసింది. "నువ్వు ఇక్కడినుండి వెళ్ళావు కదా, ఆరోజునుండీ ఏమేం జరిగాయో మొత్తం చెప్పు" అన్నారు శిష్యుడితో.

పిల్లవాడు తను ఇంటికి ఎలా చేరుకున్నాడోచెప్పాడు; మధ్య దారిలో తను చూసిని ఊళ్ళను గురించీ, తను దాటిన పట్టణాలను గురించీ చెప్పాడు; తను ఎక్కిన కొండల గురించీ, తను దాటిన నదుల గురించీ చెప్పాడు.

"ఇంకా ఏమేమి విశేషాలున్నై?" అడిగారు గురువుగారు.



శిష్యుడు కొంచెం గుర్తుచేసుకొని చెప్పాడు: "ఒకసారి నేనొక వాగును దాటాల్సి వచ్చింది. వరద వచ్చి ఉన్నది- ఉధృతంగా ప్రవహిస్తున్నది, ఆ వాగు. వాగు మధ్యలో ఒక చిన్న మట్టి కుప్ప నిలచి ఉన్నది, ద్వీపం లాగా. ఆ మట్టి కుప్ప మీద ఒక చీమల గుంపు- ఎటు పోయేందుకూ వీలుకాక, ప్రాణభయంతో కొట్టు

మిట్టాడుతున్నది. కొద్ది సేపట్లో ఆ మట్టి కుప్ప కరిగిపోతుంది- చీమలన్నీ నీటి పాలౌతాయి. నాకు వాటిని చూసి జాలి వేసింది. ప్రక్కనే ఉన్న చెట్టు కొమ్మను ఒకదాన్ని ఆ మట్టి ముద్ద మీదికి వంచి, పట్టుకొని నిలబడ్డాను. చీమలు ఒక్కటొక్కటిగా ఆ కొమ్మమీదికి ఎక్కేసాయి. అవన్నీ భద్రంగా ఒడ్డెక్కేంత వరకూ నేను కొమ్మను అట్లాగే పట్టుకొని నిల్చున్నాను. ఆ తర్వాత నాదారిన నేను వెళ్ళాను. ఆ చిన్న ప్రాణులను కాపాడగలిగానని నాకు చాలా సంతోషం వేసింది" అని.

"ఓహో, అదన్నమాట, కారణం! దేవతలు ఇతని జీవితాన్ని పొడిగించింది అందుకన్నమాట!" అనుకున్నారు గురువుగారు.

దయతోటీ, ప్రేమతోటీ మనం చేసే పనులు మన రాతనే మార్చగలవు. నిజంగానే మన రాత మన చేతల్లో ఉంది!

**పిల్లల గతి!**

**చేదు జోకు**

మహేష్ : ఒరే రాముా ! పొద్దున్న నానమ్మ ఇంటికి , సాయంత్రం అమ్మమ్మ ఇంటికి భోజనానికి వెళుతున్నావు, మీ అమ్మా,నాన్నలు ఊర్లో లేరా?

సురేష్: ఉన్నారు.

మహేష్: మరేమి? మీ అమ్మా నాన్నల మీద అలిగావా? మీ ఇంటికి ఎందుకు వెళ్ళట్లేదు?

సురేష్: మా అమ్మేమో నాన్న మీద అలిగి వాళ్ళ పుట్టింటికి వెళ్లింది. నాన్నేమో అమ్మ మీద అలిగి వాళ్ళ నాన్న ఇంటికి వెళ్ళాడు. అందుకే నేను రెండు ఇళ్లకీ వెళ్తున్నాను రోజూ!



# నమస్కారం

*మూలం: పర్తాప్ అగర్వాల్, స్టోరీస్ టు లివ్ బై* *తెలుగు అనుసరణ: నారాయణ, కొత్తపల్లి బృందం.*
*చిత్రం: అడవిరాముడు, జెయన్‌టీయు, హైదరాబాదు.*

బుద్ధూరాం చాలా సాదా సీదా మనిషి. మనసులో కల్మషం తక్కువ. ఆయన్ని గురించి తెలిసినవాళ్ళు ఒకవైపున ఆయన వ్యక్తిత్వాన్ని మెచ్చుకుంటూనే, మరోవైపున "ఈయన నిజంగానే వింత మనిషి" అనుకుంటూ ఉంటారు.

బుద్ధూరాంకు ఒక అలవాటు ఉండేది: రోడ్డు మీద నడుస్తూ ఉన్నప్పుడు, ఎదురైన వాళ్లకు ఎవరికైనా సరే, నమస్కారం పెట్టి, "నమస్తే" అనో, "రాం!రాం!" అనో అంటూ ఉండేవాడు. వాళ్ళు పరిచయస్తులే అవ్వాలని లేదు- ముక్కూ మొహం తెలీని కొత్తవాళ్ళు అయినా సరే- బుద్ధూరాం కు ఎదురు పడ్డారంటే ఒక నమస్కార బాణం తప్పని సరిగా అందేది

వాళ్ళకు!

బుద్ధారాం గడ్డాన్ని చూసి, దారిన ఉండే పిల్లలు ఒకింత ఉత్సాహంగాను, ఆశ్చర్యంగాను చూస్తుంటే, ఈయన ఒక్కోసారి చేతులు ఊపి, వాళ్ళకు "హాయ్! బై!" చెప్పి, పోయేవాడు. ఒక్కోసారి ఆగి, వాళ్లను దగ్గరికి రానిచ్చి, తన గడ్డం ముట్టుకోనిచ్చేవాడు. పిల్లలందరూ ఆయనకు బదులిచ్చి, నవ్వేవాళ్ళు-

కొందరైతే "బాగున్నావా, తాతా!?" అని అడిగేవాళ్ళు. కొంతమంది పెద్దవాళ్ళు మాత్రం ఆయన నమస్కారం పెడితే పట్టించుకునేవాళ్ళు కారు. కొందరు తిరిగి నమస్కారం పెట్టేవాళ్ళు. కొందరు ఊరికే అట్లా వింతగా చూస్తూ వెళ్ళిపోయేవాళ్ళు. చాలామంది, మొదటి సారి పట్టించుకోకున్నా, రెండోసారో మూడోసారో నమస్కారం అందుకున్నాక, ప్రతి నమస్కారం పెట్టేవాళ్ళు.

ఒకరోజు ఉదయం బుద్ధారాం ఎప్పటిలాగానే పార్కుకు వెళ్ళాడు. అప్పుడైతే మంచి గాలిని పీల్చుకోవచ్చు! నడక వ్యాయామం కూడా అవుతుంది! మంచు కురుస్తున్నది.

ఇంకా బాగా తెల్లవారలేదు. పది అడుగుల దూరంలో ఉన్న మనిషిని కూడా గుర్తుపట్టటానికి వీలు అవ్వట్లేదు.

బుద్ధారాం రోడ్డుకు ఎడమ ప్రక్కగా నడుస్తున్నాడు. రోడ్డుకు కుడివైపున, అటు ప్రక్కనుండి, ఎవరో వస్తుండటం గమనించాడు బుద్ధారాం. ఆ వచ్చేదెవరో ఈయనలాగా వ్యాహ్యాళికి వచ్చేవాడైతే కాదు- అతని వీపుమీద పెద్ద సంచీ ఒకటి వ్రేలాడుతున్నది. అతని నడక తీరు, అతను వేసుకున్న బట్టలు- అతని రూపం చూస్తే దూరం నుండే తెలుస్తున్నది- అతనొక 'చెత్తఏరుకునేవాడు' అని.

బుర్ధారాం చేతులు, నోరు అలవాటు పడి ఉన్నాయేమో, ఊరుకోలేదు- అతన్ని చూడగానే బుద్ధారాం చేతులు జోడించాడు- "రాం!రాం!" అన్నాడు. రోడ్డుకు అవతలగా నడుస్తున్న ఆ మనిషి టక్కున ఆగాడు- రోడ్డును దాటుకొని ఇటువైపుకు వచ్చాడు; భుజాన ఉన్న మూటను క్రింద పెట్టి, అమాంతం బుద్ధారాం కాళ్లమీద పడిపోయాడు!

బుద్ధూరాంకు నోట మాట రాలేదు. ఏమౌతున్నదో అస్సలు అర్థం కాలేదు. ఎవరో వచ్చి తన కాళ్ళకు మొక్కుతున్నారు! అసంకల్పితంగానే ఆయన ఆ మనిషిని వారిస్తూ, లేవనెత్తి దగ్గరకు తీసుకున్నాడు.

తీరా చూసేసరికి, ఆ మనిషి కళ్ల నిండా నీళ్ళు! సంతోషంతోటీ, కృతజ్ఞతతోటీ అతని కళ్లలో నీళ్లు నిండి ఉన్నాయి: నోట మాట రావట్లేదు.

బుద్ధూరాం అడిగాడు: "ఏమైంది బాబూ!? ఎందుకిట్లా?" అని.

చెత్త ఏరుకునేవాడు కళ్లనీళ్ళు తుడుచుకున్నాడు. మెరిసే కళ్లతో, సంతోషంగా అన్నాడు "'ఎందుకు' అని అడుగుతున్నారా, సాహెబ్? ఈ పండగ ప్రొద్దున, ప్రార్థన సమయంలో మీరు నాకు ఎంత అద్భుతమైన బహుమతిని ఇచ్చారో మీరే ఊహించలేరు. నేను ఒక పేదవాడిని- చెత్త కుప్పల్లోంచి కాయితాలను, ప్లాస్టిక్కులనూ ఏరుకొని, నా కుటుంబాన్ని పోషించు-కుంటాను. తెలిసినవాళ్ళు, తెలీని వాళ్ళు అందరూ ఒక్క తీరుగానే ప్రవర్తిస్తారు, నా పట్ల: ఎవ్వరేగాని ఇప్పటివరకూ నన్ను పట్టించుకోనే లేదు! చూసీ, చూడనట్లు పోతారు అందరూ. ఎవ్వరూ నాకు కనీసం "హలో" కూడా చెప్పరు. మీమాదిరి ప్రేమగా, గౌరవంగా, చేతులెత్తి నమస్కారం పెట్టినవాళ్ళు ఇప్పటివరకూ ఎవ్వరూ ఎదురవ్వలేదు నాకు. మీరు పెద్దమనుషులూ, గౌరవనీయులు- అయినా మీరు నాకు నమస్కారం పెట్టి, నన్ను దగ్గరకు తీసుకున్నారు- మీరు హిందువు అనుకుంటాను- నేను ముస్లిమును. అయితేనేమి, అల్లాకు ప్రియమైన వాళ్ళు మీరు! మిమ్మల్ని కలిసిన ఈ క్షణాల్ని నేను ఎన్నటికీ మరువను. మీకు నమస్కరించి, నేను అల్లాను గుర్తు చేసుకుంటాను. ఖుదా హాఫీజ్! దేవుడు మీకు తోడుగా ఉండుగాక!" అని శలవు పుచ్చుకున్నాడు.

"ఒక్క నమస్కారం ఎంత పని చేసింది!" అని బుద్ధూరాం ఆశ్చర్యపోయాడు.




# నీళ్లను వెతికిన చేప

*మూలం: పర్తాప్ అగర్వాల్, స్టోరీస్ టు లివ్ బై* *తెలుగు అనుసరణ: నారాయణ, కొత్తపల్లి బృందం*

*చిత్రాలు: గణేశ్, హైదరాబాదు.*

అనగా అనగా దేవి అనే చేపపిల్ల ఒకటి ఉండేది. అది చాలా తెలివైనది. రాళ్ళ సందుల్లో దాక్కుని ఆడుకోవటం అంటే దానికి చాలా సరదా. రాత్రిపూట సముద్రపు అడుగున, నేలబారుగా నడుస్తూ పోయే జలచరాల్ని గమనిస్తూ కూర్చోవటం కూడా దానికి చాలా ఇష్టం.

ఒక రోజున అది తన స్నేహితులైన సముద్రపు గుర్రాలకోసం ఎదురు చూస్తున్నది.

ఆ సమయంలో వాళ్ల అమ్మమ్మ గౌరమ్మ వేరే ఎవరితోనో అంటున్నది- "నీళ్ళలో బ్రతికే చేపలన్నీ.."అని.

"నీళ్లా?" అని దేవి ఆశ్చర్యపోయింది. "నీళ్లంటే?"

అమ్మమ్మకు ఎలా చెప్పాలో అర్థం కాలేదు. "నీళ్లు ఎక్కడుంటాయి?" అని ఆలోచనలో

పడింది దేవి.

కొంత సేపటికి, "ఆలోచించి లాభం లేదు. నేనే వెళ్ళి కనుక్కుంటాను- అదే నయం" అని బయలు దేరిందది.

"అయితే నీళ్ల కోసం ఎక్కడ వెతకాలి?" అని దానికి అనుమానం వచ్చింది.

సముద్రపు గుర్రాలు రాగానే అది వాటిని అడిగింది: "నమస్కారం మిత్రులారా! నీళ్లు ఎక్కడుంటాయో చెబుతారా, కాస్త?" అని.

సముద్రపు గుర్రాలు ఒకదాని ముఖం ఒకటి చూసుకున్నాయి. "ఏమంటున్నావు? నీళ్లా?! మాకెట్లా తెలుస్తుంది? మేమైతే ఇప్పటివరకూ ఆ మాటే వినలేదు!" అన్నాయి.

"అయ్యో! క్షమించండి. నేను వేరే ఎవరినన్నా అడుగుతాను" అని దేవి ముందుకు సాగింది.

కొంచెం దూరం పోయాక దానికి కొన్ని యీల్ చేపలు కనబడ్డాయి. అది అడిగింది-"హెల్లో! ఈల్ చేపలూ! నేను చాలా అవసరంగా వెతుకుతున్నాను- 'నీళ్లు ఎక్కడ ఉంటాయి?' అని. మీరు నాకు కొంచెం వెతికి పెడతారా, దయచేసి?" అని.

అవి "ఆఁ..ఊఁ" అని సణిగాయి. ఒక ఈల్ చేప దూరంగా ఉన్న ఒక గుహకేసి చూపిస్తూ "నీళ్లా?! మాకు తెలీదమ్మా, ఎక్కడని వెతకాలి? నువ్వు వెతికేవేవో బహుశ: ఆ కొండగుహలో ఉంటాయేమో మరి, చూడు" అన్నది.

దేవికి సాధారణంగా చీకటి ప్రదేశాలంటే ఇష్టం ఉండదు. కానీ అది అనుకున్నది- "ఓహో! నీళ్ళు గుహల్లో ఉంటాయన్నమాట! నేను ఎప్పుడూ గుహల్లో ఏముంటుందో చూడలేదు కదా, ఇప్పుడు పోయి చూస్తాను" అని, మెల్లగా ఆ కొండగుహలోకి పోయి వెతికింది.

అక్కడ దానికి రకరకాల మొక్కలు, రాళ్ళు, వింతవింత పురుగులు, నేలమీద ప్రాకే జీవులు- అది ఇంతకు ముందెన్నడూ చూసి ఉండనివి- చాలా కనబడ్డాయి, కానీ-నీళ్లు మాత్రం కనబడలేదు!

అది ఆ గుహలోంచి నిరాశగా వెనుదిరిగింది. గుహలోంచి బయటికి వస్తుంటే అకస్మాత్తుగా దానికొక నక్షత్రపు చేప ఎదురైంది. తన నిరాశలో దేవి దాన్ని చూసుకోనే లేదు- వెళ్ళి దాదాపు దాన్ని ఢీకొట్టింది! "ఓయ్! ఓయ్! కొంచెం

చూసుకొని పోమ్మా, చిన్న చేపా!" అన్నదది.



"అయ్యో! చూసుకోలేదు నక్షత్రం! క్షమించు. నేను ఇక్కడినుండి బయటికి పోబోతున్నాను" అన్నది దేవి.

"అయినా ఈ చీకటి గుహల్లో ఏం చేస్తోంది, చిన్న చేప?" అడిగింది నక్షత్రం.

"నేను నీళ్లకోసం వెతుక్కుంటూ వచ్చాను. ఇక్కడ వేరే ఏవేవో ఉన్నాయి గానీ, నీళ్ళు మాత్రం ఎక్కడా కనబడలేదు. అందుకని, బై! బై!" అని పోబోయింది దేవి.

"ఓయ్! ఓయ్! చిన్నచేపకు బలే సందేహం వచ్చిందే! ఆగు, ఆగు, ఒక్కనిముషం!" అని కేకలు పెట్టింది నక్షత్రం. "ఏమంటున్నావు నువ్వు? గుహలో నీళ్ళు లేవా?! అసలు నువ్వు ఈ గుహలోకి ఎట్లా వచ్చావనుకుంటున్నావు?" అడిగింది అది.

"ఉం.. ఎట్లా వచ్చానా? ఈదుకుంటూ వచ్చాను!" అన్నది దేవి తెలివిగా.

"ఓహో! మరైతే నువ్వు 'దేనిలో' ఈదుకుంటూ వచ్చావు?" అడిగింది నక్షత్రం. దాని గొంతులో ఇప్పుడు కొంచెం ఎగతాళి ఉంది.

దేవికి ఆ ప్రశ్న అస్సలు అర్థం కాలేదు. 'దేనిలోనో' ఈదటం ఏమిటి? తను కేవలం 'ఈదింది' -అంతే కదా!"

నక్షత్రం ఒక వెర్రి నవ్వు నవ్వింది. "ఓ నా ప్రియమైన చిన్న చేపా! నువ్వు ఒకవేళ నిజంగా నీళ్ళకోసమే వెతుక్కుంటుంటే మాత్రం, నీ వెతుకులాట ముగిసినట్లే. ఎందుకంటే, నీళ్ళు ఈ క్షణంలో నీ చుట్టూ ఆవరించి ఉన్నాయి!" అన్నది.

దేవి ఇంకా గందరగోళపడింది. ఇప్పుడు తన పరిస్థితి ఏంటో తెలీలేదు దానికి. సిగ్గు ముంచెత్తగా అది

"మరి, ఉం...ఈ గుహలో అంతా చాలా

చీకటిగా ఉందిగదా, బహుశ: అందువల్లనే కావచ్చు..నేను నీళ్లను చూడలేకపోతున్నాను " అన్నది.

నక్షత్రం మళ్ళీ ఒకసారి నవ్వింది: "చిన్నచేప పాపా! నువ్వు నీళ్లను చూడాల్సిన అవసరం లేదు.

నిజానికి చాలా చేపలు నీళ్ళను చూడనే చూడవు! నీళ్ళు మన లోపలా ఉన్నాయి, మన బయటా ఉన్నాయి. మనందరం ఈ నీళ్ల వల్లనే తయారౌతాం; నీళ్ల వల్లనే బ్రతుకుతాం; చివరికి ఈ నీళ్లలోనే కలిసిపోతాం. నీ చర్మం నిన్ను అన్ని వైపులా ఆవరించినట్లు, నీళ్ళు కూడా ఎల్లప్పుడూ ఆవరించి ఉంటాయి, నిన్ను. మనకు నీళ్లే జీవం! అవి లేకుండా మనం లేము" అని వివరించింది.

దేవికి కొంచెం సేపు తను వింటున్నది నిజమో కలో అర్థం కాలేదు. "నా చుట్టూతానే నీళ్లను పెట్టుకొని, ఆ నీళ్లకోసం ఎక్కడెక్కడో వెతికానే!" అనుకున్నది.

ఆ పైన దేవికి మెల్లగా ఆ నీళ్లతోటి ఏమేం చేయచ్చో కూడా తెలిసింది. అది దానిలో బుడగలు ఊదింది; తన మొప్పల్ని వాడి దానిలో ఈదింది; తనకంటే చిన్న చేపలకు ఈదటంలో సాయం చేసింది; నిశ్చలంగా, అలా-ఊరికే-ఏమాత్రం కదలకుండా నిలబడి, నీటి అలలు తన చుట్టూ కదిలి తనకు హాయినిచ్చేట్లు చేసుకున్నది. ఒకసారి 'ఉన్నాయి' అని గుర్తించాక, దేవి చేప జీవితానికి ఇక ఆ నీళ్లు మరింత ఆశ్చర్యానందాలను జోడించి, భలే సాయపడ్డాయి!

చేపచుట్టూ నీళ్ళు ఉన్నట్లుగానే, మన చుట్టూ ఉంది- సంతోషం. మనం ఒక్కసారి దాన్ని గుర్తించామంటే, ఆ సంతోషం మనల్ని ముంచెత్తగలదు! దానికోసం వేరే ఎక్కడో వెతుక్కోవాల్సిన అవసరమే లేదు!




# గ్రద్ద-గువ్వ

*సమాజంలో కలిసి నివసిస్తూ ఉంటాం కదా, ఒక్కోసారి కొట్లాటలు భయంకరంగా ఉంటుంటై. అయినా సరే- బయటివాడు ఎవడైనా నవ్వాడంటే చాలు- అందరం ఒక్కటైపోతాం. "మేమందరం ఒకే కుటుంబం" అని దబాయిస్తాం. మనలోని ఈ నైజాన్ని గద్ద ఎలా ఒంటపట్టించుకున్నదో ఈ కథలో చూడండి-*

*మూలం: ఖలీల్ జిబ్రాన్* — *తెలుగు అనువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం.*

ఒక గ్రద్ద, ఒక గువ్వ ఎత్తైన కొండ శిఖరం మీద ఉన్న ఒక బండరాయి మీద కలిశాయి.

"నమస్కారం అన్నా" అని పలకరించింది గువ్వ, గ్రద్దను.

గ్రద్ద క్రిందికి చూసి కొంచెం తిరస్కారంగానే ప్రతి నమస్కారం చేసింది.

అంతా బానే ఉంది కదన్నా? " ఇంకొంచెం మాట్లాడించింది గువ్వ.

"ఊఁ" అంది గ్రద్ద. "మేమందరం బాగానే ఉన్నాం. కానీ నీకు మర్యాదలు సరిగ్గా తెలిసినట్లు లేదే? మేం పక్షులకు రాజులమనీ, ముందుగా మేం స్వయంగా పలకరించకపోతే ఎవ్వరూ మాతో మాట్లాడరాదని నీకు తెలీదా? "

గువ్వ అన్నది- "మనం అందరం ఒకే జాతి

పక్షులం అనుకున్నావే, నేను ?" అని.

గ్రద్ద గువ్వకేసి అసహ్యపడుతున్నట్లు చూసింది- " ఒకే జాతా? 'నువ్వూ, నేను ఒకే జాతి' అని నీకు చెప్పిందెవ్వరు?" అన్నది.




అప్పుడు గువ్వ అన్నది- "కానీ ఒక్క సంగతి చెప్పనియ్యి నన్ను- నువ్వెంత ఎత్తుకు ఎగురగలవో నేనూ అంత ఎత్తుకు ఎగురగలను. అంతేకాక నేను నా పాటతో భూమి మీద ఉన్న ఇతర ప్రాణులకు సంతోషం కలిగించగలను. నువ్వు ఆనందాన్నే పంచవు, సంతోషాన్ని ఇవ్వవు." అని.

గ్రద్దకు కోపం వచ్చింది. "ఆనందం, సంతోషం! ఊహల్లో బ్రతికే పిట్టా! ముక్కుతో ఒక్కపోటు పొడిచానంటే నాశనం అయిపోతావు నువ్వు. నా కాలంత కూడా లేవు, గొంతెత్తి మాట్లాడుతున్నావేం?" అన్నది.

వెంటనే గువ్వ ఎగిరి, గ్రద్ద మీదికి దూకి కూర్చుని, దాని ఈకల్ని పీకడం మొదలు పెట్టింది. గ్రద్దకు చాలా కోపం వచ్చింది. అది వేగంగా పైకెగిరి, ఇంకా ఇంకా పైకి పోయి, కిందకు జారి, ఆకాశంలో గింగిరాలు కొట్టి, ఎలాగైనా గువ్వను వదిలించుకుందామని తంటాలు పడింది. ఎంత ఎగిరినా దానికి అలుపు వచ్చింది తప్పిస్తే, ప్రయోజనం ఏమి లేకుండింది. చివరకు అది అదే రాతి వాలింది. మునుపటికంటే చికాకుగాను, మీదికెక్కి కూర్చున్న గువ్వను, దానితోబాటు తన రాతను తిట్టుకుంటూనూ.

ఇక సరిగ్గా అదే సమయానికి అక్కడికి వచ్చిందొక తాబేలు, గునగునా నడుచుకుంటూ.

కంటపడిన దృశ్యాన్ని చూసి దానికి నవ్వు ఆగలేదు. నవ్వీ నవ్వీ దానికి కడుపు నొప్పి పుట్టి, ఆగలేక వీపు మీదికి తిరిగి వెల్లకిలా పడతానేమో అనిపించింది.



ఆ నవ్వు విని, గ్రద్ద కిందికి చూస్తే అక్కడ తాబేలు కనపడింది. " నడకరాని, ప్రాకే ప్రాణీ! ఎప్పుడూ నేలబారున పడి తిరుగుతుంటావు, దేనికి నవ్వుతున్నావిప్పుడు?" అరిచింది గ్రద్ద కోపంగా.

తాబేలు అన్నది- "ఏముంది, నువ్వు గుర్రం అయిపోయావని తెలుస్తూనే ఉన్నది- చిన్న పిట్ట ఒకటి నీ మీద ఎక్కి స్వారీ చేస్తున్నది. కానీ చిన్నపిట్టే గొప్పదని నాకు చూడగానే అర్థమైపోయి, నీ మీద జాలితో నవ్వు వస్తోంది" అని.

"నీ పని నువ్వు చూసుకో, నా గువ్వ తమ్ముడికీ నాకూ మధ్య, ఇది మా కుటుంబ వ్యవహారం. బయటి వాళ్ళకి దీనితో ఏమీ సంబంధం లేదు" అన్నది గ్రద్ద దానితో!

**తుప్పు జోకు!**

భర్త : నాకెందుకో భయంగా ఉందే!

భార్య : ఎందుకు?

భర్త : నెల రోజుల నుండి ఐరన్ టానిక్ తాగుతున్నాను కదా, ప్రేగులు తుప్పు పడతాయేమోనని.

# జన్మభూమి

*గానం: C.క్రిష్ణవేణి, A.S.గీతిక, K.భార్గవి, T.ఓంలత, 7 వతరగతి, టింబక్టు బడి.*

*స్వరకల్పన: K.గంగమ్మ, ఉపాధ్యాయురాలు, టింబక్టు బడి.*



నాదు జన్మభూమి కంటె

నాకమెక్కడుంది?

సురలోక మెక్కడుంది? "నాదు"

అమరేంద్రుడు, గంధర్వులు

అచ్చరులును మచ్చరులు

వేడుకగా వలస వచ్చి

విహరించే హిమశృంగం "నాదు"

కాళిదాసు కంటి కొసల

పసిడి కళల పూలబాల

మనగిరి ధర ధామం

స్వర్గసీమలో ఎక్కడ "నాదు"

పచ్చని సశ్యామల సుశ్యామల

పసిడి సీమ మనదు ధరణి "నాదు"

చందనమును మరపించు

అమర ధామము

పసిడి పంటలకు ఇదియే ఆలవాలము "నాదు"



# వెలుగు

*గానం: A.S.నందన, సునీల్, సంకీర్తన, శివకుమార్, 4 వ తరగతి, టింబక్టు బడి.*

*చిత్రం: మారుతి, బసినేపల్లి, అనంతపురం జిల్లా*



వెలుగులన్నింటిలోన ఏ వెలుగు చెప్పుడు
మా ఇంటి పాపలూ తిరగంగ వెలుగు

నవ్వులన్నింటిలోన ఏ నవ్వు వెలుగు
మా ఇంట పాపలూ నవ్వంగ వెలుగు

ఆటలన్నింటిలోన ఏ ఆట వెలుగు
మా ఇంట పాపల్లూ ఆడంగ వెలుగు

పల్కులన్నింటిలోన ఏ పల్కు వెలుగు
మా ఇంట పాపల పల్కులే వెలుగు

ఇంటింటా ఇంటింటా ఏ వెలుగు వెలుగు
ఇంటింటా ఇంటింటా మా బాల వెలుగు.




ఇంటర్నెట్ సౌకర్యం ఉన్నవాళ్ళు ఈ సంచికలోని పాటలన్నిటినీ వినవచ్చు, డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.
సందర్శించండి: http://kottapalli.in/2010/12/welcome

# వందనమో భారతమా

*గానం: C.క్రిష్ణవేణి, A.S.గీతిక, K.భార్గవి, T.ఓంలత, 7 వ తరగతి, టింబక్టు బడి*

*సేకరణ: K. గంగమ్మ, ఉపాధ్యాయురాలు, టింబక్టు బడి*



వందనమో - భారతమా

అందరము నీ వారమమ్మా

మేమందరమూ నీ వారము



వినీల గగనపు వీధుల తాకెడి-

వింధ్యహిమాచల గిరిధారీ

విశ్వవ్యాపినీ - విమల రూపిణీ

విజయ భారతీ సుతులమమ్మా

గలగల పారెడి గంగా సింధు

పదములు కడుగగ కావేరి

పుణ్యనదమ్ములు నిండిన పావన

పుణ్యమూర్తి పుత్రులమమ్మా

వీర శివాజి గురు గోవిందుల - పృథ్వీరాజ ప్రతాప సింహుల

ధర్మరక్షకై దీక్షను బూనిన- ధీశాలుర వారసులమమ్మా

“వందనమో భారతమా"

# ముస్లిం- హిందూ

*గానం: C.పవన్, B.చంద్రశేఖర్, 5 వతరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి.*

*స్వరకల్పన: P.హనుమంతు, ప్రధానోపాధ్యాయులు, టింబక్టు బడి.*



ముస్లిం హిందూపిల్లలారా
ముందుకు పోదాం రారండోయ్
భారత దేశం మనదే మనదే
బజావోఢంకా బాలల్లారా      "ముస్లిం హిందూ"

## కొత్తపల్లి డిసెంబరు 2010

హిందూక్రైస్తవ బాలల్లారా
భారత దేశం మనదేమనదే
చీటికి మాటికి జగడాలాడే
తాతల మాటల వినకండోయ్

ముస్లిం హిందూ పిల్లల్లారా
హిందూక్రైస్తవ బాలల్లారా
ముందుకు పోదాం రారండోయ్!

శూరుడు శివాజి వీరుడు బోసు
భారతీయులే బాలల్లారా
భావి కాలమున భారత భూమిని
బాల వీరులే పాలించాలోయ్

ముస్లిం హిందూ పిల్లల్లారా
హిందూక్రైస్తవ బాలల్లారా
ముందుకు పోదాం రారండోయ్!

పదండి పదండి ముందుకు
భారత దేశం మనదే మనదే "”ముస్లిం హిందూ"



# ఎల్లలెరుగని వాళ్ళము

*గానం: K.భార్గవి, G.సంధ్య, A.S.గీతిక, C.క్రిష్ణవేణి, 7 వ తరగతి, టింబక్టు బడి.*



ఎల్లలెరుగని వాళ్ళము - కల్లలెరుగని వాళ్ళము
బాలలం మేమొక్కటే లోకమూ మాకొక్కటే

గోధుమరంగున కొందరు-
పసుపువన్నె ఇంకొందరు
తెలుపు, నలుపు, ఆపిల్ ఎరుపూ
ఏరంగైనా ముచ్చట గొలుపు
రంగేదైనా, రూపేదైనా
నివసించే ఆ చోటేదైనా
బాలలం మేమొక్కటే
లోకమూ మాకొక్కటే "2"



అన్నం, పప్పు,  చారూ, కూర శాఖాహారం తినువారైతే
తిండేదైనా,  తీరేదైనా తినగోరే ఆ రుచులేవైనా
బాలలం మేమొక్కటే లోకమో మాకొక్కటే "2"



అవునంటారు, ఎస్ అంటారు.
'ఒకే, టాటా' అందురుకొందరు.
'సీ' 'దేఖో' 'జా' అంటూ
పలువిధాలుగా పలుకుచుందురు
మాటేదైనా, పాటేదైనా
పెదాలు కలిపే భాషేదైనా
బాలలం మేమొక్కటే
లోకము మాకొక్కటే "2"

దేశాల్ వేర్వేరైనా కాని
సందేశం మాదిదే ఇదే
సంతోషంలో సకల ప్రపంచం
పకపకలాడాలన్నదే
బాలలం మేమొక్కటే
లోకమూ మాకొక్కటే  "2"
"ఎల్లలెరుగని వాళ్ళము"



# బుజ్జి ఇంట్లో బాల హనుమాన్!

*నిర్వహణ: G.లలిత, telugu4kids.com*

ఈ బొమ్మను చూస్తే మీకేమనిపిస్తున్నది?



బుజ్జి ఇంట్లో బాల హనుమాన్ బాగున్నాడా? వాడు ఈ ఇల్లు ఎప్పుడు కట్టుకున్నాడట? ఓహో.. వేరే పిల్లలు ఎవరైనా కట్టి పెట్టారేమో, వాడికోసం! కాదా..?! మరి తమకోసమే కట్టుకున్నారా? మరి పిల్లల ఇంటికి హనుమాన్ ఎందుకు కాపలా కాస్తున్నాడు? మీకు తెలిస్తే చెప్పెయ్యండి! ఆ కథను వీలైనంత తొందరగా మాకు పంపించండి. బాగున్న కథలను కొత్తపల్లి పత్రిక జనవరి సంచికలో ప్రచురిస్తాం.

**మా చిరునామా:** కొత్తపల్లి బృందం,
2-312, చెన్నేకొత్తపల్లి - 515 101,
అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్. (ఇ-మెయిలు: team@kottapalli.in)

## మీరూ భాగస్వాములు కండి!

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి- నిజం. అందుకని, మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి- వాళ్ళనూ కథలు రాసేందుకు, పాటలు పాడుకునేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి; కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే, పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చెయ్యండి.

మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం. వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకొనైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం..

## ముద్రణ:

మీరు చదువుతున్న ఈ పుస్తకం ఇంకు జెట్ ప్రింటర్‌లో- సిరంజిలతో మళ్ళీ మళ్ళీ ఇంకులు వేయటం ద్వారా ముద్రించబడింది. మీ మీ రచనల్ని అతి తక్కువ పెట్టుబడులతో ముద్రించుకునేందుకు ఈ పద్ధతి చాలా అనువైనది. దీంతో ప్రతి బళ్ళోనూ ఒక పత్రికను మొదలుపెట్టుకోవచ్చు!


## కృతజ్ఞతలు:

పత్రికకోసం నిరంతరంగా పిల్లల రచనల్ని అందించి సహకరిస్తున్న ప్రకృతి బడి, టింబక్టు బడి, విజ్ఞాన స్కూల్ యాజమాన్యాలకు కృతజ్ఞతలు. వెబ్ సైటుకు వెన్నుదన్నుగా నిల్చిన infogami యాజమాన్యానికి, దాన్ని సుసాధ్యం చేసిన python భాషకు, చక్కని ఆపరేటింగ్ సిస్టం linux ను అందించిన ubuntu వారికి, గొప్ప వ్యవస్థని పూర్తిగా ఉచితంగా అందిస్తున్న OpenOffice వారికి, తెలుగును రప్పిస్తున్న Unicode, Scim, Baraha లకు, చిత్రాలను సరిదిద్దే Software Gimp నిర్మాతలకు, శబ్దాలను చక్కబరచే Software Audacity నిర్మాతలకు కృతజ్ఞతలు.



## కొత్తపల్లి బృందం

**ప్రధాన సంపాదకులు:** నారాయణ

**సాంకేతికం:** సుబ్బరాజు, ఆనంద్, లక్ష్మి

**చిత్రాలు:** వీరాంజనేయులు, అడవి, మారుతి.

**ఈ మాసపు జోకులు:** శ్రీలక్ష్మి


## చందా వివరాలు

**సంవత్సర చందా:** 200/ రూ.

చందాను 'కొత్తపల్లి ట్రస్టు' పేరిట మనీఆర్డర్ లేదా డి.డి రూపంలో కట్టవచ్చును.


**మా చిరునామా:**

కొత్తపల్లి ట్రస్టు,
2-312, న్యామద్దల రోడ్డు, చెన్నేకొత్తపల్లి,
అనంతపురంజిల్లా, 515101.
ఫోను: 08559 240222


**బ్యాంకు ద్వారా చందా కట్టడానికి వివరాలు:**

KOTTAPALLI TRUST,
A/c No:0138101018809 (Savings A/c),
CANARA BANK, Chennekottapalli,
Anantapur District, A.P.
IFSC code: CNRB0000138.


ఇ మెయిలు: team@kottapalli.in

మంచి పుస్తకం:

# రాజు-పేద

వేల్సు యువరాజు అన్నాడు - "అలా సరదాగా ఒక్కసారి గడపడానికి నా తండ్రి రాజ్యమంతా ఖర్చయినా లెక్కచెయ్యను. ఊఁ, ఇంకా."

టాం చెప్పాడు "చీప్‌సైడు బజార్లో వసంతోత్సవాలు జరిగేటప్పుడు నాట్యం చేస్తూ, పదాలు పాడతాము. ఇసకలో ఆడుతూ దొర్లుతాము. బురదలో ఆడుకుంటాము- అబ్బ, ఏం బురద, ప్రభూ! ప్రపంచంలో అంత మంచి పదార్థంఇంకోటుందా! బురదలో నానుతుంటే బలే మజాగా ఉంటుంది."

"చాల్చాలు. ఇంకేం చెప్పకు. అద్భుతం. పరమాద్భుతం! నీ బట్టల్లాంటివి తొడుక్కుని, ఒక్కసారంటే ఒక్కసారి, ఎవ్వరూ వద్దనేవాళ్ళు లేకుండా బురదలో పొర్లాడితే- ఈరాజ్యం పోయినా ఫరవాలేదు"

అట్లా సరదాగా మొదలైన ప్రయాణం వాళ్లనే కాదు, మనల్నీ వేరు వేరు లోకాలకు తీసుకెళ్తుంది.

వేల్సు యువరాజు బిచ్చగాళ్ళ కొంపలోను, బిచ్చగాడు రాజభవనంలోను ఇరుక్కుని, అష్ట కష్టాలు అనుభవిస్తారు. ఆ క్రమంలో పండే హాస్యం ఎవరినైనా నవ్విస్తుంది, కళ్ళనీళ్లు పెట్టిస్తుంది. సమాజంలో పెచ్చుమీరుతున్న అసమానతల పట్ల మార్క్ట్వేను సంధించిన శస్త్రాల్లో అతి ప్రభావవంతమైనది ఈ "రాజు-పేద". పదహారేళ్ళు వచ్చేలోగా ప్రతి ఒక్కరూ చదివి తీరాల్సిన పుస్తకాల్లో ఇది ఒకటి. తప్పక చదవండి.

**రాజు-పేద**

రచన: మార్క్ట్వేన్

అనువాదం: నండూరి రామమోహనరావు

ప్రచురణ: అభినందన పబ్లిషర్సు

